# ఆంధ్రపత్రిక

THE ANDHRA PATRIKA- MADRAS. సంపుటం 43. సంచిక 20 FOUNDER DESODHARAKA K. NAGESWARA RAO శనివారం 21-4-1956 Reg. No. M. 1118. 6 పేజీలు 1 అణా

# ఆంధ్ర సచివాలయ సిబ్బందికి హైదరాబాదులో వసతి

## ప్రస్తుతం సిద్ధంగా ఉన్న వెయ్యి ఇళ్లను తాత్కాలికంగా

## కేటాయించే ఆలోచన

కర్నూలు, ఏప్రిల్ 20 : ఆంధ్ర ప్రదేశ్ అవతరణం నాటికి కర్నూలునుంచి హైదరాబాదు వెళ్లే, ప్రభుత్వోద్యోగు లందరికీ, విధిగా వసతి చూపించాలని, ఆంధ్ర ప్రభుత్వం అడిగినట్లు తెలిసింది.

ప్రస్తుతం హైదరాబాదులో తక్కువ రాబడి వచ్చే మధ్యతరగతి ప్రజల కోసం కట్టినవి 500 ఇళ్లు. పారిశ్రామికుల గృహనిర్మాణ పథకం క్రింద కట్టినవి మరో 500 ఇళ్లు ఉన్నవి.

ప్రభుత్వోద్యోగుల కోసం ప్రత్యేకంగా యిళ్లు కట్టేయిలోగా, యిప్పుడు సిద్ధంగా ఉన్న యీ యిళ్లను, ఉద్యోగులకు ప్రత్యేకించాలని, ఆంధ్ర, హైదరాబాదు ప్రభుత్వాలు ఆలోచిస్తున్నాయి.

ఇళ్లు లేక యిబ్బందిపడవలసి వస్తుందేమోనని, ఉద్యోగులు చాలా ఆదుర్దా పడుతున్నారు.

అక్టోబరు 1 లోగా, యిక్కడి ఉద్యోగులందరూ హైదరాబాదుకు వెళ్ళడం సాధ్యం కాకపోవచ్చు. పూర్తిగా బదిలీచేయడానికి ఒక సంవత్సరం పట్టుతుందనుకుంటున్నారు. ఈలోగా ప్రభుత్వ కార్యాలయాలను హైదరాబాదుకు మార్చడానికి, పైన చెప్పిన వెయ్యి యిళ్ళను ప్రభుత్వోద్యోగులకు ప్రత్యేకించడానికి, అవసరమైన యేర్పాటు చేసేందుకు, ప్రత్యేకంగా కొంత సిబ్బందిని నియమించడం ...

### ఉద్యోగుల పంపిణీ

### ఒక ఏడు విడి పరిపాలన?

అక్టోబరు 1న ఆంధ్ర తెలంగాణాలు కలసిపోయి ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన పరిపాలనా వ్యవహారం, రెండు ప్రాంతాలకు, వేరు వేరుగా, ఏకకాలంలోనే సాగించుతూ ఉండాలని ఒక ఆలోచన జరుగుతున్నది. ఈవిధంగా ఒక సంవత్సరమయ్యేసరికి, రెండు ప్రాంతాల పరిపాలనా వ్యవస్థలు, క్రమేపీ, ఏకమౌతాయని అనుకొంటున్నారు.

## దక్షిణాఫ్రికాలో కూడా బస్సు సత్యాగ్రహం

### రంగుజాతుల ప్రతిక్రియ

కేప్‌టౌన్, ఏప్రిల్ 19: కేప్‌టౌన్‌లో బస్సుల్లో రంగు జాతులకు ప్రత్యేక స్థానాలను ఏర్పాటుచేసినందుకు నిరసనగా రంగుజాతులు సోమవారంనాడు ప్రారంభించిన బస్సు సత్యాగ్రహం నాలుగురోజులనుంచీ జరుగుతున్నది. దీనివల్ల బస్సు కంపెనీ అప్పుడే దెబ్బతినటం ప్రారంభమయింది. సోమవారంనుంచీ ఆదాయం బాగా తగ్గిపోయిందని బస్సు కంపెనీ అధికారి ఒకరు తెలియజేశారు.

బస్ యజమానులు, కేప్‌టౌన్ పురపాలక సంఘం ఈజాతి కేటాయింపు వద్దని తీర్మానించినా, ప్రభుత్వ రవాణా సంఘం నగరంలో ఆరు మార్గాలమీద ఈ కేటాయింపు విధించింది. దీనికి బదులుగా అసలు బస్సులు ఎక్కటమే అపి వేశారు రంగుజాతులే ...

### తెలంగాణా భూమి శిస్తు పెంపు?

### ఒకే ప్రమాణం: శ్రీ చంద్రమౌళి సూచన

సికిందరాబాదు, ఏప్రిల్ 20: "ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలలో, భూమిశిస్తులో తేడాలున్నవి. శిస్తు మొత్తం తగ్గించో లేక హెచ్చించో చేసో, భూమిశిస్తును రెండు ప్రాంతాలలో ఒకే ప్రమాణంలోకి తీరడం అవసరం" అని ఆంధ్ర రెవెన్యూ మంత్రి శ్రీ కల్లూరి చంద్రమౌళి, యీ ఉదయం మా ప్రతినిధితో చెప్పారు.

ఇప్పుడు తెలంగాణా ప్రాంతంలో భూమి శిస్తు రేట్లు, ఆంధ్రప్రాంతంలో కంటె చాలా తక్కువగా ఉన్నవి. అభివృద్ధి ప్రణాళికలకు డబ్బు కావలసిన యీ సమయంలో, ఆంధ్ర ప్రాం...

### మరి రెండు జాతి వివక్షత శాసనాలు

## ఈజిప్టు ఇజ్రేల్ యుద్ధ విరమణ

### ఇరుపక్షాల అంగీకారం

జెరూసలెం, 19: ఇజ్రేల్, ఈజిప్టులు తమ సరిహద్దుల పొడవునా బేషరతుగా యుద్ధ విరమణకు అంగీకరించాయని సమితి కార్యదర్శి శ్రీ హామర్ షెల్డు నేడు ప్రకటించారు.

ఈజిప్టు నాయకులతో సంప్రతింపులు జరిపిన తర్వాత ఇజ్రేల్ నాయకులతో సంభాషించే నిమిత్తం శ్రీ హామర్ షెల్డ్ వచ్చారు. శ్రీ హామర్ షెల్డ్ ప్రకటన పాఠాన్ని ఇజ్రేల్ ప్రధాని శ్రీ డేవిడ్ బెన్ గురియన్ ఆమోదించారనీ, ఈజిప్టు కూడా ఆమోదం తెలిపిందని ఇజ్రేల్ వర్గాలు తెలిపాయి.

### జోర్డాన్‌తో సంఘర్షణ

### స్టాలిన్ పేరు లేదు

### రష్యాలో 'మే' దినోత్సవ నినాదాలు

మాస్కో, ఏప్రిల్ 19: ఏటేటా మే దినోత్సవానికి విప్లవ వార్షికోత్సవానికీ సోవియట్ రష్యా కేంద్ర కమ్యూనిస్టు సంఘం ప్రజలకు నినాదాలు సూచిస్తుంది.

ఈ యేడు సూచించిన నినాదాల్లో స్టాలిన్ పేరు పూర్తిగా అంతర్థానమైపోయింది. స్టాలిన్ పేరుకు బదులు "మార్క్సిజమ్-లెనినిజమ్ పతాకనీడలో కమ్యూనిస్టుపార్టీ నాయకత్వంలో కమ్యూనిస్టు వ్యవస్థ దిగ్విజయానికి పురోగమించండి" అని నినాదం ఆదేశించారు.

ఈ మారు నినాదాల్లో ఇంకో క్రొత్తదనం ఉంది. కమ్యూనిస్టులు, సోషలిస్టులు, ఇతర అభ్యుదయశక్తులు అని చేర్చి, వీని శాంతి ప్రజాస్వామ్య ...



దేశోద్ధారకుని వర్ధంతి నేడే

## అమెరికాతో మైత్రికి బ్రిటిష్‌తో డ్వాటు

### రష్యా నాయకుని అభ్యర్థన

### పరస్పరం సహనంతో నడవక తప్పదని శ్రీ కృష్చేవ్ విశ్వాసం

లండన్, ఏప్రిల్ 19: "బ్రిటన్ అమెరికాల మధ్య వైరాలు సృష్టించాలని రష్యా ప్రయత్నిస్తున్నదనడం అసత్యం. మీరు ఎవ్వరితోనూ కలహాలు పెట్టుకోవాలని మా కోరిక కాదు. సైగామీతో డ్వాటుతో అమెరికా మొదలైన దేశాలకీ మధ్య సత్సంబంధాలు ఏర్పరుచుకోవాలని మా కోరిక. మన దేశాలమధ్య బాంధవ్యాలను వృద్ధిపరుచుకోవాలనే ఆశతో, మేము మీ వద్దకు శుద్ధాంతఃకరణతో వచ్చాము." అని సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కార్యదర్శి శ్రీ నికితా కృష్చేవ్ సోవియట్ రాయబార కార్యాలయంలో జరిగిన విందులో అన్నారు.

"... విషయమై ఒకే అభిప్రాయం అసంభవం అనే సంగతి మాకు తెలుసు.

"శాంతి అనే సమస్యపట్ల కూడా అభిప్రాయాలలో భేదాలకు అవకాశం ఉంది."

(5 వ పేజీ 4 కాలం చూడుడు)

## బాగ్దాద్ కూటం: కాశ్మీర్ ప్రసక్తి

### బ్రిటిష్ ప్రతినిధి కుంటిసాకు

### అమెరికా సైనిక సహకారం

టెహరాన్, ఏప్రిల్ 19: బాగ్దాద్ సైనికకూటం నాల్గు రోజుల సమావేశం అనంతరం చేసిన సంయుక్త ప్రకటనలో కాశ్మీరు సమస్యా పరిష్కారం ప్రసక్తి తీసుకువచ్చారు.

ఈ కూటం స్థాపించిన కుట్ర నిరోధక సంఘంలో అమెరికా చేరింది. సైనిక సహకారం కూడా ఇవ్వడానికి బాగ్దాద్ కూట ప్రధాన కార్యస్థానంలో అమెరికన్ సైనిక సహకార ...

4 వ పేజీ 7 వ కాలం చూడుడు

## 3 మార్గాలు కావాలంటే ఒక్కటే మంజూరు చేశారు

### రైల్వే శాఖ చర్య పట్ల ఆంధ్ర గవర్నరు విచారం

విశాఖపట్నం, ఏప్రిల్ 17 : ఆంధ్ర ప్రభుత్వం మూడు కొత్త రైలుమార్గాలను నిర్మించాలని అడిగితే, ఒక్కటి మాత్రమే మంజూరు చేయడం చాలా విచారకరం. మన దేశంలో రైలుమార్గాల అభివృద్ధికి రెండవ పంచవర్ష ప్రణాళికలో ఎక్కువడబ్బు కేటాయించి ఉంటే బాగుండేది" అని గవర్నరు శ్రీ త్రివేది, నిన్న సాయంత్రం రైల్వే వారోత్సవాలసభకు అధ్యక్షత వహిస్తూ చెప్పారు.

శ్రీమతి త్రివేదితో కలిసి, శ్రీ త్రివేది, ఇక్కడ ఆగ్నేయ రైల్వే శాఖ యేర్పాటు చేసిన ఉత్సవానికి వచ్చారు. ఇక్కడ ఆగ్నేయ రైల్వే ప్రధానాధికారి ...

... సించిన పనులుకూడా జరుపదలచామని చెప్పారు. విద్యుచ్ఛక్తినీ, యంత్రాలను ఉపయోగించడం గురించి శ్రద్ధగా ఆలోచిస్తున్నామని అన్నారు.

### రష్యాతో కెనడా వ్యాపార ఒడంబడిక

## ఖూనీలు చేయని నాగాలకు క్షమాదానం

### లొంగిపోవలసిందని ప్రాంతీయసేనాని హెచ్చరిక

న్యూఢిల్లీ, ఏప్రిల్ 19: ఖూనీలు మొదలైన ఘోర నేరాలు చేయని నాగజాతి విప్లవకారులు లొంగిపోయినట్లయితే, వాళ్ళకు పూర్తి రక్షణ ఇస్తామని అస్సాం, ఈశాన్య సరిహద్దు ప్రాంతీయసేనాని మేజర్ జనరల్ ఆర్. కె. కొచార్ నేడొక ప్రకటన చేశారు.

నాగవిప్లవవాదులు రెండు వారాల్లోగా దగ్గర్లో ఉన్న అధికారులకు తమ ఆయుధాలను అప్పగిస్తే ఈ రక్షణ వర్తిస్తుందని ఆయన తెలియజేశారు.

"వాళ్లలో ఎవరో కొద్దిమంది మాత్రమే హత్యలు, నేరాలు, ... చేశారు. శాంతంగా బతకదలచుకున్న ప్రజలు ఎంతోమంది దీనివల్ల బాధపడ్డారు. ...

నాగ ప్రజలు మన దేశీయులే. వాళ్లు మనతోపాటు స్వతంత్రదేశంలో కలిగే లాభాలు అనుభవించాలని కోరుతున్నాము. అయితే తోటి ప్రజలమీదనూ, ప్రభుత్వంమీదనూ దౌర్జన్యం చేసేవాళ్లు సమాజానికే, శాంతిభద్రతలకూ శత్రువులే. శాంతి భద్రతలను ...

# అఖిలభారత ఆర్యవైశ్య మహాసభలు

25 వ అఖిలభారత ఆర్యవైశ్య మహాసభలు 1956 వ సంవత్సరం, ఏప్రియలు, 28, 29 వ తేదీలలో శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరీ అమ్మవారి జన్మస్థానమైన పశ్చిమ గోదావరి జిల్లాలోని పెనుగొండ క్షేత్రమున జరుగును. అనుబంధ మహాసభలుగూడ జరుపబడును యావద్భారతములోని వైశ్య మహాజనులెల్లరు మహాసభలకు విచ్చేసి సభలను జయప్రదముగావించవలసినదిగా ప్రార్థించుచున్నాము. "పెనుగొండ చేరుటకు తాడేపల్లిగూడెం లేక నిడదవోలు రైలుస్టేషనులో దిగవలెను."

ఆహ్వానసంఘము
పైడా వెంకటరత్నం, జనరల్ కార్యదర్శి
పెనుగొండ, 9-4-56.



# సర్ఛార్జిలెక్కల తయారీభత్యం

## ఇవ్వాలని గ్రామోద్యోగుల అభ్యర్థన

కంచుకూరు, ఏప్రిల్ 15: సర్ఛార్జి లెక్కలను తయారు చేసే సందర్భంలో పంద పట్టాలకు కరణాలకు రు 10, శిస్తు సర్ఛార్జి వసూలు చేసేందుకు ప్ర గ్రామ మునసబుకు నూటికి రు 10 ఇప్పించమని ప్రభుత్వాన్ని కోరుతూ కంచుకూరు తాలూకా గ్రామోద్యోగుల సంఘ సమావేశంలో తీర్మానించారు.

అవసర పనులకు ప్రధాన కేంద్రాలకు పిలిపించేప్పుడు గ్రామోద్యోగులకు ప్రయాణఖర్చులు ఇప్పించమని, ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానించారు.

నాగాయలంక ఫిర్కా, మాలెళ్ళ తాలూకా గ్రామాధికారుల చర్యలకు హర్షం ప్రకటించుతూ ఒక తీర్మానం చేశారు. కొత్త సంవత్సరానికి ఈ సంఘం అధ్యక్ష కార్యదర్శులుగా శ్రీయుతులు బత్తుల రామలింగారెడ్డి, ఎస్. రాజారావు గారలు ఎన్నికైనారు.

పోలీసుశాఖ, ఆంధ్ర
వేలం నోటీసు

చిత్తూరుజిల్లా పోలీసు ఆఫీసు ఆవరణలో సైన్యంలో వాడిన 1942 మోడల్ పోలీసు జీపు ఎ. డి. సి. 378 బహిరంగ వేలములో 25-4-56 తేదీ ఉ. 11 గంటలకు విక్రయించెదరు. విక్రయ షరతులు జిల్లా పోలీసు సూపరింటెండెంటు, చిత్తూరు నుండి పొందగలరు.

ఎం. ఎల్. థామస్, జిల్లా పోలీసు సూపరింటెండెంటు, చిత్తూరు.

కావలెను

కృష్ణా జిల్లాబోర్డు పబ్లిక్ హెల్తు డిపార్టుమెంటు క్రింద లేడీ విజయ్ హెల్తు అసిస్టెంటు రు. 45-2-55-1-75 స్కేలు ఫిక్సెడు బత్తా రు. 33/- యింకొయితర అలవెన్సులమీద అప్పాయింటు చేయుటకు గాను శానిటరీ యిన్‌స్పెక్టరు కోర్సు ప్యాసయిన స్త్రీ కావలయును. అప్లికేషను 30-4-56 తేదీలోగా చేరవలెను.

కె. మోహనరావు, MBBS., BSSc.,
కృష్ణా జిల్లా హెల్తాఫీసరు.
చిలకలపూడి, 16-4-1956.

టెండరు నోటీసు

ముమ్మిడివరం పంచాయతీ ఉపయోగం నిమిత్తం 1956-57 సం॥రమునకు (1) స్టేషనరీ సామానుకు (2) మామూలు వీధిలాంతర్ల సామానుకు (3) R. C. సిమ్మెంటు సామానుకు టెండర్లు యీ పంచాయతీ ఎగ్జిక్యూటివు ఆఫీసరు గారిచే పంచాయతీ ఆఫీసులో 8-5-56 తేదీ ఉదయం 11 గంటల లోగా తీసుకొనబడును. వివరములకు ఈ పంచాయతీ ఆఫీసుకు వ్రాసి తెలుసుకొనవచ్చును.

చింతపెంట వెంకట్రావు, ఎగ్జిక్యూటివు ఆఫీసరు, ముమ్మిడివరం, 15-4-56.

బహిరంగ ప్రకటన
ఆంధ్ర ప్రభుత్వము
విద్యుచ్ఛక్తి శాఖ, ఆంధ్ర పవర్ సిస్టమ్

రాజమండ్రి ఎలెక్ట్రిక్ సప్లయ్ కార్పొరేషన్ లిమిటెడ్, రాజమండ్రి, విద్యుచ్ఛక్తి సంస్థ స్వాధీన పర్చుకోవటం.

ఆంధ్ర విద్యుచ్ఛక్తి సప్లయి సంస్థల (స్వాధీనపు) చట్టము 1954, మరియు 19-10-55 తేదీ గల జి.ఓ. నెం. 2100, ఆంధ్రప్రభుత్వ ప్రకటన 10-4-56 తేదీ గల జి. ఓ. ఎమ్స్. నెం. 1015 పి. డబ్ల్యు & టి. డిటి. లలోనూ, తరువాతి ఉత్తర్వుల ప్రకారం రాజమండ్రి లోని విద్యుచ్ఛక్తి సంస్థ 20-4-56 తేదీన, మరి ఆ తేదీనుండి ఆంధ్ర ప్రభుత్వ విద్యుచ్ఛక్తి శాఖ స్వాధీనమవుతుందని రాజమండ్రి ఎలెక్ట్రిక్ సప్లయ్ కార్పొరేషన్ లిమిటెడ్ వారి ద్వారా విద్యుచ్ఛక్తి వాడకం దారులతో సహా, అందరికి యిందు మూలముగా తెలియజేయటమైనది. అన్ని వర్కుషాప్పులు, స్టోర్సు, ఆస్తులు, స్థిర, చర ఎక్విప్ మెంటులు, సంస్థలో భాగమైన టవర్లు, ప్లాంట్లు, లారీలు, లైనులు, సబ్-స్టేషనులు, పవర్ స్టేషనులు, సర్వీసెస్, మీటర్లు, వీధిదీపాల ఫిట్టింగులు, టెస్టింగ్ ఎక్విప్ మెంటు, మరియు అన్ని చెట్లు, ఫెన్సులు, కంచెలు, అగడ్తలు, నీటివసతులు, మార్గపు నడుపాయాల హక్కులలో సహా ఇతర ఆస్తులు, మరియు పై సంస్థకు చెందిన లేదా మరేవిధంగానైనా సంబంధించిన దేనా చెందినవని తెలియవచ్చిన ఉపకరణములు పూర్తిగా, ఎల్లప్పుడూ, ఎట్టి తాకట్టులలో నిమిత్తములేకుండా ఆంధ్ర ప్రభుత్వము స్వాధీనమై ఉండును.

2. విద్యుచ్ఛక్తి సంస్థను తీసుకున్న తేదీనుండి, అది సూపరింటెండింగ్ ఇంజనీర్, ఆంధ్ర పవర్ సిస్టమ్, విజయవాడ, పరిపాలనా ఆధిపత్యంలోకి వస్తుంది.

3. విద్యుచ్ఛక్తి సప్లయికి సంబంధించిన అన్ని ఉత్తర ప్రత్యుత్తరాలు స్థానిక అసిస్టెంటు ఇంజనీర్, ఆక్విజిషన్, పవర్ హౌస్, రాజమండ్రి, వారి పేర వ్రాయవచ్చును.

4. విద్యుచ్ఛక్తి సప్లయ్ ఛార్జీలు, సంస్థకు రావలసిన ఇతర బాకీలు, పవర్ హౌస్, రాజమండ్రి, వద్దగల విద్యుచ్ఛక్తి శాఖ ఆఫీసుకు చెల్లించవలసి ఉంటుంది.

టి. నారాయణరావు,
సూపరింటెండింగ్ ఇంజనీర్,
ఆంధ్ర పవర్ సిస్టమ్.

# ఆయుర్వేద వైద్య ప్రాముఖ్యం

## తూర్పుగోదావరిజిల్లా మహాసభలో విజ్ఞప్తి

రాజమండ్రి, ఏప్రిల్ 16: జిల్లా ఆయుర్వేద వైద్యుల సమావేశం నిన్న శ్రీ తిరుపతిరాయ కాంగ్రెసు భవనములో ఆంధ్ర వైద్యమండలి అధ్యక్షులు శ్రీ వస్తాదు వెంకటస్వామి నాయుడు అధ్యక్షతను జరిగింది. జిల్లాలోని అన్ని ప్రాంతాలనుంచీ పలువురు వైద్యులు వచ్చి యిందు పాల్గొన్నారు. శ్రీ పొన్నాడ వెంకటాద్రి స్వాగతమిచ్చారు. ఆయుర్వేద వైద్యులు సంఘటితంగా కృషి చేయకపోతే యీ ప్రాచీన వైద్యవిధానమునకు చిక్కులు రాగలవన్న భయం వెలిబుచ్చారు.

సభా ప్రారంభకులు శ్రీ స్వామి ప్రజ్ఞానంద ఆయుర్వేదమున ఆయురభివృద్ధికి కృషి చేయగల అవకాశము బున్నదని నొక్కి వక్కాణించారు.

శ్రీ గోగినేని వెంకటసుబ్బయ్య చౌదరి మద్రాసులోని భారతీయ వైద్యసంస్థలో తెలుగువారికి కలిగిన కష్టనష్టముల క్రోడీకరించారు. శ్రీ అవనిగడ్డ నాగభూషణం ఆంధ్రరాష్ట్రంలో ఆయుర్వేద వైద్యవ్యాప్తికిగల అవకాశములను సవివరంగా పేర్కొన్నారు. శ్రీ శిరిపురపు సేతుమాధవరావు ఆయుర్వేద వైద్యుల కలిసికట్టూ, ఐక్యతావశ్యకతను గురించి ప్రసంగించారు. ఏకసంఘావశ్యకతను వివరించారు. శ్రీ కృష్ణమోహన్, శ్రీ పెద్దింటి కృష్ణమాచార్యులు, శ్రీ కవిరాజ మోహన్, శ్రీ ముస్తాక్ సాహెబు, శ్రీ సి. వనమురాజు, శ్రీ బళ్ళ నరసింహమూర్తి, శ్రీ నాగాభట్ల సుబ్రహ్మణ్యశర్మ, శ్రీ ఏడిద బంగారయ్య, శ్రీ పిల్లా అప్పలనర్సయ్యప్రభృతులు మొదలగువారు సంఘటిత వైద్యమండలి ఆవశ్యకతనుగురించి ఉద్బోధించారు. సభాధ్యక్షులు వైద్యులలో సంఘీభావము లేనంతకాలము యీ వైద్యవిధానమునకు ప్రభుత్వం గుర్తింపు లభించదనీ, అందుచేత అందరూ తమతమ విభేదాలు విస్మరించి సంఘటితంగా, నిర్మాణ కృషి చేయాలని హెచ్చరించారు.

## కార్యవర్గం

తూర్పుగోదావరి జిల్లా ఆయుర్వేద వైద్యమండలికి ఈ క్రింది కార్యవర్గమును ఎన్నుకున్నారు:

శ్రీ పొన్నాడ వెంకటాద్రి అధ్యక్షులు; శ్రీ ద్విభాష్యం వెంకటసూర్యనారాయణమూర్తి, శ్రీ తిరుపతి రామానుజయ్యవార్లు ఉపాధ్యక్షులు; శ్రీ నాగాభట్ల సుబ్రహ్మణ్యశర్మ కార్యదర్శి; శ్రీ పెద్దింటి రామకృష్ణమాచార్యులు, శ్రీ ఏడిదబంగారయ్య సహాయ కార్యదర్శులు; శ్రీ పొన్నాడ భాస్కరం కోశాధిపతి.

శ్రీ దుర్గావఝల సీతారామాంజనేయులు, శ్రీ డి. సుబ్బారావు, శ్రీ గోనపల్లి శేషాద్రి, శ్రీ కాకరాల వెంకటరమణయ్య, శ్రీ అంగర వెంకటాచార్యులు, శ్రీ తిరుపతి రాఘవసూరి, శ్రీ పెద్దింటి సీతారామభార్గవ, శ్రీ బి. గవరయ్య జేవర, శ్రీ డి. వి. సత్యనారాయణమూర్తి, శ్రీ ఎస్. బుచ్చిరాజు, శ్రీ రావర్తి అప్పారావు—సభ్యులు.

## తీర్మానాలు

ఆంధ్ర ఆయుర్వేద వైద్యమండలి తరఫున 'ఆయుర్వేద పత్రిక' అనే పత్రికను తమ స్వంతఖర్చుపై నడుపుటకంగీకరించిన శ్రీ వస్తాదు వెంకటస్వామి నాయుడుగారికీ, అందుకు ఉదారంగా విరాళమిచ్చిన శ్రీ గోగినేని వెంకటసుబ్బయ్య చౌదరి, శ్రీ సిరిపురపు సేతుమాధవరావు, శ్రీ పిల్లా అప్పలనర్సయ్య ప్రభృతులుగారలకు ధన్యవాదాలర్పిస్తూ తీర్మానించారు.

అఖిలభారత ఆయుర్వేద వైద్యమండలి అధ్యక్షులు శ్రీ వై. పార్థనారాయణ పండిట్ తెలుగు దేశ సంచార కార్యక్రమమును వెంటనే తయారుచేసి, వారి ఆమోదములో యేర్పాటుచేసి, రాష్ట్ర మండలి కార్యవర్గులు కూడ వారితో తెలుగుదేశ పర్యటనలో కూడా వుండాలని కోరుతూ తీర్మానించారు.

రాజమండ్రిలో జరుగు గోదావరి పుష్కర సందర్భంలో స్థానికంగా వున్న శ్రీ ధన్వంతరీ సమాజమువారు యేర్పాటుచేస్తున్న ఉచిత ఆయుర్వేద వైద్యాలయములకు రాష్ట్ర మండలి వైద్యులూ సంఘాలూ సహకరించి సహాయము చేయాలని అభ్యర్థించారు.

హైదరాబాదు ముఖ్యమంత్రి శ్రీ బూర్గుల రామకృష్ణారావు తెనాలి తాలూకా కూచిపూడి రానున్న సందర్భములో రాష్ట్ర ఆయుర్వేద వైద్యమండలి తరఫున వారికి స్వాగతమిచ్చి విజ్ఞప్తి సమర్పించాలని కార్యదర్శులను కోరుతూ తీర్మానించారు.

లోకసభ సభ్యులు శ్రీ మోహనలాల్ సాక్సేనా ఆయుర్వేద వైద్యవిధానమును సమర్థిస్తూ ఆ సభలోనూ వెలుపలా చేయుచున్న కృషికి వారికి కృతజ్ఞతను తెల్పారు.

శ్రీ ఏడిద బంగారయ్య వందన సమర్పణ చేశారు. (స్వ. వి.)

## ఏజెన్సీప్రాంత రైతుల అవస్థలు

రాజమండ్రి, ఏప్రిల్ 14: ఏజెన్సీ ప్రాంతాల రైతులు అటవీ ప్రాంతాల నుంచి పంటచేలకు, వ్యవసాయపనిముట్లు గృహోపకరణాలు తెచ్చుకోవటంలో ఎదుర్కొంటున్న యిబ్బందుల వివరాలు ప్రభుత్వానికి కిసాన్ సమ్మేళన్ విజ్ఞప్తిపత్రం అందజేయనున్నది. గనుక రైతులందరూ ఏజెన్సీప్రాంతాలలోని యిబ్బందులను రాష్ట్ర కార్యాలయానికి లేదా తూర్పు గోదావరిజిల్లా కార్యాలయానికి తెలియచేయాలని శ్రీ పెండ్యాల సత్యం విజ్ఞప్తి చేస్తున్నారు.

# శ్రీ అల్లుపోతయ్యకు సన్మానం

## పిడేలు విద్వాంసుడు

రాజమండ్రి, ఏప్రిల్ 17: సుప్రసిద్ధ సంగీతోపాధ్యాయుడు, వాయులీన విద్వాంసుడూ అయిన శ్రీ అల్లు పోతయ్యకు యీ నెల 15 తేదీ సాయంత్రము శ్రీ తిరుపతిరాయ కాంగ్రెసు భవనములో శ్రీ శ్రీ నిర్వికల్పానందస్వాములవారి అధ్యక్షతను శ్రీ లక్ష్మీ గణపతి త్యాగరాజ విద్వత్సంఘంవారి ఆధ్వర్యాన సన్మానం జరిగింది.

శ్రీయుతులు బచ్చు సత్యనందం సాహుకార్, భమిడిపాటి కామేశ్వరరావు, తోలేటి కనకరాజు, గ. శ్రీ. న. ఆచార్య, చేబ్రోలు చిన్మయ బ్రహ్మం, చింతపెంట వీరభద్ర భాగవతార్, సాహూ జనాబాయి, పోతా ప్రగడ సుబ్బ భాస్కరరావు, ఐ. ఎల్. ఎస్. శర్మ, రంప శంకరశాస్త్రి గార్లు శ్రీ పోతయ్య ప్రతిభను ప్రశంసించారు. శ్రీమతులు బి. కె. వెంకటరమణమ్మ—భువనగిరి లక్ష్మీ కాంతమ్మ సన్మాన పత్రాలు సమర్పించారు. సుప్రసిద్ధ సంగీత విద్యా గురువులు శ్రీ శిష్టు సర్వశాస్త్రి శ్రీ పోతయ్యను ఆశీర్వదించి సన్మాన సంఘము తరఫున, సువర్ణహస్త ఘంటా కంకణమూ. పీతాంబరములు, దుశ్శాలువ, రు 1116 లు నగదూ బహూకరించారు.

శ్రీ పోతయ్య యీ సన్మానానికి కృతజ్ఞత తెల్పుతూ సన్మాన సంఘ కార్యకర్తలు శ్రీ కొంపెల్ల సోమయాజులు - శ్రీ తిరుపతి వెంకటేశ్వరరావు శ్రీ భమిడిపల్లి భీమయ్య గారికీ, సభనలంకరించిన పురపెద్దలకూ, తమ్మాశీర్వదించిన పౌరప్రముఖులకూ వందనాలర్పించారు. (స్వ. వి.)

# పుష్కరాలకు రానూ పోనూ టిక్కెట్లు

రాజమండ్రి, ఏప్రిల్ 17: పుష్కరాల కోసం వచ్చే యాత్రికుల సౌకర్యార్థం అన్ని స్టేషనులనుంచి రాను పోను టిక్కెట్లు యిస్తారని పుష్కరం ఏర్పాట్ల అధికార సంఘ కార్యదర్శి సబ్ కలెక్టరు శ్రీ వి. శ్రీనివాసాచారి నేడు విలేఖరులతో మాట్లాడుతూ చెప్పారు.

"ఏర్పాట్లు పూర్తి కావస్తున్నవి. కోటిలింగాల వద్ద షెడ్ల నిర్మాణము 25 వ తేదీ నాటికి పూర్తి అవుతుంది. గోదావరి స్టేషనువద్ద తాత్కాలికమైన నిర్మాణం ఇంచుమించు పూర్తి గావచ్చింది. విద్యుచ్ఛక్తి, నీటి గొట్టముల మార్గాలను పుష్కరం శిబిరస్థలం వరకు తీసుకువచ్చారు."

"కోటిలింగాల వద్ద మెట్లను 200 అడుగులు వెడల్పు చేసే ఏర్పాట్లు చేయాలని నిర్ణయించాం. దీని మూలముగా 5 వేల మంది ఒకేసారి నదిలో స్నానం చేయడానికి వీలవుతుంది. ఇందుకు రూ 20 వేలు ఖర్చవుతుంది. అక్కడ స్త్రీలకు వేరే ఏర్పాట్లు వుంటాయి. వారికి వేరే ఫలహారశాల కూడా వుంటుంది" అని వివరించారు. విరాళాలు తమ పేర పంపాలని కోరారు.

## బాలభటుల కృషి

పుష్కరాల సందర్భంలో బాలభటులు, గైడ్లు, చేయవలసిన పనుల గురించి సబ్ కలెక్టరుతోను, స్థానిక బాలభటులతోను భారత్ బాలభట, గైడ్ల, సంఘ (ఆంధ్ర) కార్యదర్శి శ్రీ డి. యస్. రాజారావు చర్చించారు. భోజన, వసతి, ఏర్పాట్ల వివరాలు రూపొందించారు.

బాలభటులకు, గైడ్లకు ఒక కేంద్ర శిబిరం వుంటుంది. వీరు షిఫ్ట్ పద్ధతి ప్రకారం పని చేస్తారు. శిబిరాలను శ్రీ పి. కామేశ్వరరావు శ్రీమతి వివేకానందదేవి నిర్వహిస్తారు. కొవ్వూరు శిబిరాన్ని శ్రీ యస్. రామకృష్ణరావు నిర్వహిస్తారు. వీలయితే మురికి ప్రాంతాల పారిశుధ్య కార్యక్రమం కూడా బాలభటులు నిర్వహిస్తారు. వీరిలో 800 మందికి ఉచిత భోజన, వసతి సౌకర్యాలు మే 4 నుంచి గోదావరి కిరువైపులా కలుగజేయాలని సన్నాహాలు జరుగుతున్నాయి.

## రహదారి నిబంధనలు

పుష్కర సందర్భంలో గమనించవలసిన రహదారి నిబంధనల గురించి డి.ఎస్.పి. ఒక ప్రకటన చేశారు. అందులో ఇలా తెలిపారు:

మెయిన్‌రోడ్డు, గోదావరి కట్ట, లిప్టన్ పేట (ఆర్యపురం) కోటిలింగాలు (కలప అడితులు) రోడ్లమీద ఏ విధమైన వాహనములు (బండ్లు) పోకూడదు.

శ్యామలాంబ గుడిరోడ్డు, జంపంజా రోడ్డుమీద వాహనములకు ఒక వైపు దారి మాత్రమే.

శ్యామలాంబ గుడిరోడ్డుకు ప్రవేశము చర్చివద్ద మాత్రమే. జంపాపంజా రోడ్డుకు ప్రవేశము కోటగుమ్మము వద్ద మాత్రమే.

ధవళేశ్వరం — రాజమండ్రి రోడ్డు నుంచి వచ్చే వాహనాలు అన్నీ మోరంపూడి రోడ్డు, ఎగ్జిబిషను రోడ్డుమీదుగా రైల్వేపాసురోడ్డు ద్వారా ట్రంకురోడ్డుకు గోకవరం రోడ్డుకు పోవాలి.

ట్రంకురోడ్డు, గోకవరంరోడ్డునుంచి వచ్చే వాహనాలన్నీ జానిపేట, శ్యామలాంబరోడ్డుమీదుగా ధవళేశ్వరం రోడ్డుకు పోవాలి.

ధవళేశ్వరం — రాజమండ్రి రోడ్డు నుండి వచ్చే వాహనాలు ఎలక్ట్రికల్ కార్పొరేషన్ దాటి గోదావరి కట్టమీదకు పోకూడదు. కాలేరు, ట్రంకు రోడ్డునుండి వచ్చే వాహనాలన్నీ పుష్కరాల రేవుదాటి గోదావరి కట్టమీదకు పోకూడదు.

రాజమండ్రి ద్వారా నేరుగా వెళ్లవలసినవారిలన్నీ మిలిటరీరోడ్డుమీదుగా అనగా లాలా చెరువు ధవళేశ్వరంరోడ్డు మీదుగా పోవాలి.

పట్టణంలో వాహనాలమీద సరుకు ఎగుమతి దిగుమతులు రాత్రి 12 గంటల నుండి తెల్లవారుజామున 4 గంటలవరకు మాత్రమే చేయవచ్చు.

ఎప్పుడూ రోడ్డుకు ఎడమప్రక్కగానే నడవాలి రోడ్డు మధ్యభాగంలో గుమికూడరాదు. రోడ్డు మీద దుకాణాలు పెట్టరాదు.

# మత్స్య పారిశ్రామికుల సంఘం

రాజమండ్రి, ఏప్రిల్ 17: పట్టణంలోని పల్లెకారులు (మత్స్య పారిశ్రామికులు) యీ నెల 15 తేదీ ఉదయం మినర్వా టాకీస్ హాలులో శ్రీ జి.ఎస్. బాలాజీ దాస్ అధ్యక్షతను సమావేశమయ్యారు. చుట్టు ప్రక్కల గ్రామాల నుంచి చాలామంది చేపలు పట్టేవారు ఇందులో పాల్గొన్నారు. యీ వృత్తిదారులు నిత్యజీవితములో ఎదుర్కొనే కష్టములను గురించి పలువురు మాట్లాడారు.

రాజమండ్రి తాలూకా మత్స్య పారిశ్రామిక సంఘాన్ని రిజిస్టరు చేయించాలని తీర్మానించారు.

రేవుల నిబంధనలు, చేపలు పట్టేవారికి విధించే సుంకాలు, వీరి వృత్తి కవసరమయిన వలలకు కావలసిన నూలు సరఫరా పద్ధతి, పురపాలక సంఘ సుంకాల వసూలు కంట్రాక్టరు తన కంట్రాక్టు షరతులలో రేటుకంటె హెచ్చుగా సుంకాలు వసూలు చేస్తున్న అంశం, పుష్కరాల సందర్భములో గోదావరిపై నావలలో ప్రయాణం చేసేవారికి యాత్రిక పన్ను వేయడం వల్ల పల్లెకారులకూ పట్టణవాస్తవ్యులకూ కలిగే ఆర్థిక కష్టమూ, వివరిస్తూ తీర్మానాలు చేశారు.

శ్రీ యస్. వెంకన్న అధ్యక్షుడుగా, శ్రీ మోక శ్రీరాములు కార్యదర్శిగా, మరి 13 గురు సభ్యులుగా కార్యనిర్వాహక వర్గమును ఎన్నుకున్నారు.

## తాలూకా ప్రాథమికోపాధ్యాయ సంఘం

రాజమండ్రి తాలూకా ప్రాథమికోపాధ్యాయ సంఘ స్థాయిసభ ఈ నెల 15 తేదీ సాయంత్రం శ్రీ గౌతమీ గ్రంథాలయంలో శ్రీ వై. పి. హెచ్. బాబూరావు అధ్యక్షతను జరిగింది. కార్యదర్శి శ్రీ కె. సుబ్బారావు వార్షిక నివేదిక నుచదువగా ఆమోదించారు. నూతన కార్యవర్గం ఎన్నుకున్నారు. శ్రీయుతులు వై. పి. హెచ్. బాబూరావు (అధ్యక్షులు), వి. వేణుగోపాలాచారి (ఉపాధ్యక్షులు), శ్రీ జి. వి. శేషగిరి (ప్రధాన కార్యదర్శి), వై. వి. శర్మ-డి. సూర్యనారాయణ (సహాయ కార్యదర్శులు), డి. సత్యనారాయణమూర్తి, కె. ప్రకాశరావు, పి. సూర్యారావు, పి. వి. ఆర్. శర్మ, డి. వెంకటనారాయణ, కె. కృష్ణమూర్తి సభ్యులు.

ఫెడరేషను రాజకీయాలతో సంబంధం లేదని పునరుద్ఘాటిస్తూ తీర్మానించారు. 3 వ ఫారమువరకూ ఉచిత విద్యా సౌకర్యము కలుగజేసిన ఆంధ్ర ప్రభుత్వాన్ని అభినందించారు. కుప్పుస్వామి సంఘ నివేదిక సూచనలను ఫెడరేషన్ సూచించిన సవరణలతో అమలు జరుపవలసినదని ప్రభుత్వాన్ని అర్థించారు. నిబంధనలకు వ్యతిరేకంగా ప్రాథమికోపాధ్యాయుల పనినుంచి తొలగించటం ఆపు చేయించవలసినదిగా విద్యాశాఖాధికారులను కోరారు. జీతాలు సకాలంలో అందజేయటం ప్రావిడెంటుఫండు యేర్పాటు కోరారు. 60 వ సంవత్సరం వరకూ ఉద్యోగ పరిమితి నిర్ణయించి 2 సంవత్సరాల సర్వీసు తరువాత శాశ్వతం చేయాలని కోరారు. (స్వ. వి)

# మదరాసు ధరలు

మదరాసు, ఏప్రిల్ 20:

బంగారు వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు పవరను 1-కి ఎన్వర్డు బొమ్మ సేల్సుటాక్సుతో సహా రు. 66-12-0
పిల్లా బంగారం తులం రు. 106-10-0
మూన బంగారు రు. 105-8-0
సీమవెండి తులం100కి రెడీ రు. 182-0-0
చిల్లర ధర రు. 1-14-0

వేరుశెనగ

(531 పా॥ 1-కి ఎక్సుకోస్తా గిడ్డంగుల మెషిన్ సేల్సుటాక్సుతో సహా
డిసెంబరు రు. 155-160
వేరుశెనగనూనె ఎస్పెల్లర లో 8% 500పా.) రెడీచిల్లరధర 314
కొబ్బరినూనె (37½ పాములు) సేల్సుటాక్సు అదనం
ఆంబుమార్కు రు. 26-0-9
ఎం. ఎస్. బ్రాండ్ డబ్బా 26-8-9
రాజా రు. 25-12-9

ఆముదం

తిరుపత్తూరు (500 పా.) రు. 270-0-0
(2 మాండి)
బ్రిటిష్, రిఫైన్డ్ షుగర్ 85-8-9
పాకిస్ 86-12-9
రూ 1 కి 0-1-3 ప్రత్యేక సేల్సుటాక్సు

# న్యూయార్కు దూది

## జూలై వాయిదా ధరలు

న్యూయార్కు, ఏప్రిల్ 19:

న్యూయార్కు, కాటన్ మార్కెట్ ధరలు నేడీ విధంగా ఉన్నవి:

నేటి ప్రారంభ ధర 32.95
నేటి ముగింపు ధర 22.83

# క్రీడారంగం

# ఆంధ్ర వ్యాయామ మహాసభ

## ఏప్రిల్ 22న తెనాలిలో

తెనాలి, ఏప్రిల్ 18: ఆంధ్రరాష్ట్ర వ్యాయామ విద్యా ప్రచార మహాసభ ఈ నెల 22వ తేదీన తెనాలి తాలూకా హైస్కూలులో జరుగుతుంది. ఆంధ్రరాష్ట్ర విద్యాశాఖ డిప్యూటీ డైరెక్టర్ శ్రీ ఎల్. బుల్లయ్య సభకు అధ్యక్షత వహిస్తారు. రాష్ట్రంలో వ్యాయామ విద్య చీఫ్ ఇన్‌స్పెక్టర్ శ్రీ ఆర్. వి. సత్యనారాయణరాజు సమావేశాన్ని ప్రారంభిస్తారు.

ఉదయం 11 గంటల నుంచి 1-30 వరకు విషయ నిర్ణయసభ శ్రీ ఆర్. వి. సత్యనారాయణరాజు అధ్యక్షతన జరుగుతుంది. ఇందులో జిల్లా వ్యాయామ విద్యా సంఘాల జిల్లా క్రీడా సంఘాల అధ్యక్ష కార్యదర్శులు, రాష్ట్ర క్రీడా సంఘాల అధ్యక్ష కార్యదర్శులు, ఇతర ప్రముఖులు పాల్గొంటారు.

మధ్యాహ్నం 3 గంటలకు తేనీటి విందుతో కార్యక్రమం ప్రారంభమవుతుంది. శ్రీ కె. సుబ్రహ్మణ్యం (పెరవలి హైస్కూలు హెడ్మాస్టర్), శ్రీ ఎం. ఎస్. మోహన్, శ్రీ కె. సుబ్బారావు (ఆంధ్ర వ్యాయామ కళాశాల ప్రిన్సిపాల్), శ్రీ వి. సూర్యనారాయణమూర్తి ప్రభృతులు ప్రసంగిస్తారు.

యోగాసనాలు, బరువు ఎత్తటం (శ్రీ ఈశ్వరరావు, శ్రీ సత్యనారాయణచారి ప్రభృతులచే), మల్ఖంబ్ మొదలైన విద్యా ప్రదర్శనలు ఉండగలవు.

22 వ తేదీ ఉదయం 8 నుంచి 9 గంటలవరకు ఊరేగింపు, ఉత్తర, దక్షిణ గుంటూరు వ్యాయామ విద్యా సంఘాల సర్వ సభ్య సమావేశం జరుగుతవి. (స్వ. వి.)

# విశాఖపట్నంలో ఎథలిటిక్ శిక్షణ శిబిరం

విజయవాడ, ఏప్రిల్ 18: మే నెల 6 వ తేదీనుంచి 26 వ తేదీవరకు విశాఖపట్నంలో స్పెషల్ ఆరమ్డ్ పోలీసు గ్రౌండ్సులో ఎథలిటిక్ శిక్షణ శిబిరం నడుస్తుందని ఆంధ్రా ఎమెచూర్ ఎథలిటిక్ ఎసోసియేషన్ కార్యదర్శి శ్రీ వి. సూర్యనారాయణగారు తెలియచేస్తున్నారు. ఇది రాష్ట్ర కోచింగ్ స్కీము, ఆంధ్రా ఎమెచూర్ ఎథలిటిక్ ఎసోసియేషన్ల సంయుక్త ఆధ్వర్యాన జరుగుతోంది.

హైస్కూళ్లు, కాలేజీలు, పోలీసు, రైల్వే, టంతి, తపాలా శాఖలకూ ఇతర క్లబ్బులకూ చెందిన ఎథలీటులలో తగిన వారి నెంచుకొని శిక్షణ ఇస్తారు. శిక్షణ పొందేవారు శిబిరంలోనే ఉండాలి. ఈ శిబిరానికి ఒక్కొక్క జిల్లా ఎథలిటిక్ సంఘం నలుగురు ప్రతినిధులను పంపవచ్చునని రాష్ట్ర ఫిజికల్ ఎడ్యుకేషన్ చీఫ్ ఇన్‌స్పెక్టర్ అనుమతించి ఉన్నారు.

వివరాలకు శ్రీ వి. సూర్యనారాయణ గౌరవ కార్యదర్శి ఆంధ్రా ఎమెచూర్ ఎథలిటిక్ ఎసోసియేషన్, పటమట, కృష్ణాజిల్లా అనే చిరునామాకు వ్రాయాలి.

# తెనాలి బాడ్మింటన్

తెనాలి, ఏప్రిల్ 17: తెనాలి ఎన్. జి. ఓ. క్లబు ఆధ్వర్యాన జరుగుతున్న ప్రథమ ఈస్ట్‌కోస్ట్ బాడ్మింటన్ టోర్నమెంటులో నేడు ఫైనల్స్ పోటీలు జరిగినవి.

ఫైనల్సులో గోకవరం అమ్మిరాజు ఫైవ్సు (డి. అమ్మిరాజు, డి. గంగాధరం, కృష్ణమూర్తి, లవకుమార్, మృత్యుంజయరావు.) బందరు చిన్నా మెమోరియల్ జట్టును (కె. రాజారావు, డి. భావనారాయణ, లక్ష్మణరావు, రామచంద్రరావు, సి. హెచ్. సుబ్రహ్మణ్యం) ఓడించింది (29-23, 29-19, 18-29, 28-29, 29-14).

డబుల్స్ తెనాలి ఎన్. జి. వో. క్లబ్ 'ఏ' జట్టు (వి. రామచంద్రరావు, ఆర్. మోహనరావు) విజయవాడ ఆంధ్రా యూనియన్ (లవకుమార్, కృష్ణమూర్తి)ని ఓడించింది. (13-29, 39-24, 29-23.)

సాయంత్రం ప్రిన్సిపల్ సబార్డినేట్ జడ్జి శ్రీ వి. ఆర్. చలపతిరావుగారు రెవిన్యూ డివిజనల్ ఆఫీసర్ శ్రీ వి. సత్యనారాయణగారి అధ్యక్షతన జరిగిన సభలో బహుమతులు పంచిపెట్టారు.

పోటీలలో ప్రత్యేక నైపుణ్యం చూపినందుకు పేటపాలెం బి. బి. సి. ఎం. జట్టుకూ, వ్యక్తిగతంగా ఆటలో నుంచి నేర్పు చూపించిన శేషగిరిరావుకు బహుమతులు ఇవ్వబడినవి. (స్వ. వి.)

# కాకినాడ కాస్మాపాలిటన్ క్లబ్ పోటీలు

కాకినాడ, ఏప్రిల్ 17: కాకినాడ కాస్మాపాలిటన్ క్లబ్ వార్షికోత్సవము ఉగాదినాడు జరిగింది. అధ్యక్షులు శ్రీ డి. గోపాలరావు, ఎం. ఎల్., ఏ. కార్యదర్శులు శ్రీయుతులు ఎస్. బలరామమూర్తి, ఉంగరాల హనుమంతరావు గార్లు మాట్లాడిరి. అధ్యక్షులు ఆటలలో గెలుపొందినవారికి బహుమతులు పంచిపెట్టిరి.

టెన్నిస్ డబుల్సు 1. శ్రీ పి. జగన్నాథరావు, జె. రామకృష్ణారావు 2. పి. కామేశ్వరరావు, డా॥ జగన్నాథరావు బిలియర్డ్సు 1. డా॥ చలపతిరావు 2. బి. రవీంద్రనాథ్ స్నూకర్సు-1. ఏ. వి. రమణారావు 2. డా॥ చలపతిరావు బ్రిడ్జి - 1. ఆర్. వెంకట్రావు ఆర్. వి. భట్ 2. సి. వి. రమణారావు, డా॥ చలపతిరావు టేబిల్ టెన్నిస్. 1. కె. సూర్యనారాయణ సింగిల్సు 2. కె. వి. కృష్ణారావు టేబిల్ టెన్నిస్ డబుల్సు 1. ఎస్. బలరామమూర్తి, కె. వి. కృష్ణారావు 2 కె. వి. సూర్యనారాయణమూర్తి కె. సూర్యనారాయణ, స్త్రీలలో గెలుపొందినవారు. బాల్ (స్త్రీ) 1. మిసెస్. ఎ. నారాయణరావు 2. మిసెస్ ఎస్. బలరామమూర్తి కేండిల్ లైటింగ్ 1. మిసెస్ కె. సూర్యనారాయణమూర్తి 2. మిసెస్ సుబ్రహ్మణ్యం. (స్వ. వి.)

# నందిగామ తాలూకా చెడుగుడు పోటీలు

చందర్లపాడు, ఏప్రిల్ 16: నందిగామ తాలూకాలోని ఆటగాండ్రకు చందర్లపాడు గ్రామంలో ఈ నెల 15, 16 తారీఖులలో యంగ్‌మెన్ అసోసియేషనువారి యాజమాన్యమున చెడుగుడు, పొడుగు దాటుట, గుండు విసరుట, మొదలైన ఆటల పోటీలు బహు చక్కగ నిర్వహింపబడి, జయప్రదము గావింపబడినవి. పై అసోసియేషనుకు శ్రీ కట్టా చౌదరి అధ్యక్షులుగాను, శ్రీ గోలి నరసింహారావు సెక్రటరీగాను ఎన్నుకొనబడిరి. 16-4-56 సాయంత్రము డాక్టరు యస్. సత్యనారాయణగారి అధ్యక్షతన గొప్ప బహిరంగ సభ జరిగినది. ప్రజానాయకులైన శ్రీ కోలారు వెంకటేశ్వర్లు గారు ఉపన్యసించుచు అసోసియేషను వారి కృషిని అభినందించి, ఆటల పోటీలలో గెలుపొందిన విన్నర్సుకు రజత పాత్ర, రన్నర్సుకు రజత పతకములను బహూకరించిరి. సభాంతమున దక్కని బుర్రకథ ఏర్పాటు చేయబడినది సుమారు 4000 జనాభా వచ్చి, చూచి, ఆనందించి, అసోసియేషను వారి కృషిని ప్రశంసించి సభను జయప్రదము గావించిరి. శ్రీ కె. లింగేశ్వరరావు గారి వందన సమర్పణతో సభ ముగిసినది. ఈ ఆటల పోటీలను స్థానిక బోర్డు హైస్కూలు డ్రిల్లు మాష్టరైన శ్రీ పి.వి. నరసింహంగారు రిఫరీగా అతి సమర్థతతో నిర్వహించి, పెక్కుమంది చే ప్రశంసలను పొందిరి. (ఒ. వి)

ఇటీవల గుంటూరు రామచంద్రపుర అగ్రహారమునందు ద్వితీయ జుబిలీ మెమోరియల్ వాలీబాల్ టోర్నమెంట్సు జరిగినవి.

సీనియర్సు, విన్నర్సు: వెంకటేశ్వర మెమోరియల్ 'ఏ' టీము, పొన్నూరు.

రన్నర్సు: వెంకటేశ్వర మెమోరియల్ 'బి' టీము పొన్నూరు.

జూనియర్సు, విన్నర్సు: యంగ్ స్టార్సు గుంటూరు.

రన్నర్సు: సాయి 'సి' టీము, గుంటూరు.

బహుమతులను శ్రీ సి. చెంచురామయ్య గారు పంచిపెట్టిరి.

# ఉస్తాద్ వీరవెంకయ్యగారి మృతికి సంతాపం

ఏలూరు, ఏప్రిల్ 15: ప్రఖ్యాత మల్లవిద్యాయోధుడు ఉస్తాద్ పాపోలు వీరవెంకయ్య నాయుడుగారి మృతికి సంతాపం తెలుపుతూ పశ్చిమగోదావరి జిల్లా కాంగ్రెస్ సహాయ కార్యదర్శి శ్రీ మాలె వెంకటనారాయణ ఇలా ప్రకటన చేశారు.

"ఆంధ్రభీష్మ-సువర్ణ-హస్త ఘంటా కంకణ బిరుదాంకితులు, ప్రఖ్యాత ఆంధ్ర మల్లవిద్యా నిపుణులగు వుస్తాద్ పాపోలు వీరవెంకయ్య నాయుడుగారి మరణవార్త విని దుఃఖించని ఆంధ్రుడుండడు. ఆయన మరణం ఆంధ్ర వ్యాయామ, మల్లవిద్యాప్రవీణులకే గాక అశేష ఆంధ్రులకు తీరని లోటు. స్వర్గీయ శ్రీ నాయుడుగారు చిన్నతనము నుండియు మల్లవిద్యలో మక్కువ కలిగి పెక్కు కుస్తీలలో ఆంధ్ర-ఆంధ్రేతర వుస్తాదులను ఓడించిరి. ఏలూరు పట్టణంలోనే గాక నిఖిలాంధ్రలోను శ్రీ నాయుడుగారికి పెక్కుమంది శిష్యులు గలరు.

శ్రీ నాయుడుగారి మరణమువలన దుఃఖసాగరమున మునిగియున్న శ్రీ వారి కుమారులకే గాక ఆత్మీయులకు, అశేషశిష్యవర్గమునకు నా గాఢమైన సంతాపమును వెలిబుచ్చుచు శ్రీ వారి ఆత్మశాంతికై భగవానుని ప్రార్థిస్తున్నాను."

# సాయుధ దుండగీళ్లతో నిరాయుధ పోరాటం

ఔరంగాబాద్, ఏప్రిల్ 18: తుపాకులు కాలుస్తున్నా లెక్కచెయ్యకుండా నిరాయుధులయిన గ్రామీణులు ఇద్దరు సాయుధ దుండగీళ్లను తరిమికొట్టిన సాహసవృత్తాంతం తెలియవచ్చింది. ఔరంగాబాద్ జిల్లా అష్టేకర్ అనే గ్రామ ప్రజలు ఈ సాహస కార్యాన్ని చేశారు.

నిన్న రాత్రి ఇద్దరు దుండగీళ్లు తుపాకులతో, ఖాకీదుస్తులతో, గ్రామంలో ఒకరి ఇంట్లో జొరబడ్డారు. ఒంటరిగా ఉన్న ఇద్దరు ఆడవాళ్ళను కొట్టి నగలు ఇవ్వవలసిందని వేధించారు. ఆడవారి కేకలు విని గ్రామస్థులు పరుగెత్తుకురాగా, దుండగీళ్లు తుపాకులు కాల్చటం ప్రారంభించారు. అందువల్ల గ్రామస్థులు ఆ ఇంట్లోకి ప్రవేశించ వీలు లేకపోయినా, రాళ్లవర్షం కురిపిస్తూ పోరాడారు.

అరగంట సేపయిన తరవాత, దుండగీళ్లు పారిపోవ ప్రయత్నించగా, గ్రామస్థులు వారిని తరిమి పట్టుకుని దగ్గరలో ఉన్న పోలీసు స్టేషన్‌లో అప్పగించారు.

# ఆకాశవాణి

ఆదివారం, ఏప్రిల్ 22

విజయవాడ

ఉ॥ 6-50 స్వాగతం 6-55 ప్రసార విశేషాలు 7 తెలుగున వా॥ 7-15 మదరాసు (బి) వలె 8 ఇంగ్లీషున వార్తలు 8-15 వాద్యసంగీతం- విలయ విద్యాంసుడు 8-30 సంస్కృతమున కార్యక్రమం.

10 అ॥ భా॥ సంగీత కార్యక్రమం (ఢిల్లీ) శాస్త్రీయ సంగీతం- అంబాదాస్ పంత్- షఫీ వాజ్ పన్నాలాల్ ఘోష్ వేణువు.

మ॥ 1 మద్రాసు వలె 1-30 (బి) వలె 1-40 హిందీలో వా॥ 1-50 తెలుగున వా॥ 2 మద్రాసు వలె.

సా॥ 5-30 నూకల సత్యనారాయణ 6 స్థానిక ప్రకటనలు 6-05 ప్రాంతీయ వార్తలు 6-15 గ్రామస్థుల కార్యక్రమం ఝాన్సీరాణి బుర్రకథ 7-05 తెలుగున వా॥ 7-30 గీతావళి గణేశ్వరపు బాబూరావు 7-45 ఉభయకుశలోపరి 8 నూకల సత్యనారాయణ 8-30 ప్రస్తుత విశేషము (ఇంగ్లీషు ప్రసంగం) ఢిల్లీ 8-45 వాద్యసంగీతం (బి) బిస్మిల్లా బృందం షహనాయ్ 9 ఇంగ్లీషున వా॥ 9-15 గీతావళి- గణేశ్వరపు బాబూరావు 9-30 రసమయి- పండితారాధ్య చరిత్రలోని విచిత్ర విషయ విజ్ఞానము (మద్రాసు నుండి రిలే) 9-45 కల్యాణి (బి) 10 ప్రసార సమాప్తి.

మద్రాసు (ఎ)

ఉ॥ 6-50 స్వాగతం 6-55 కార్యక్రమ వివరణ 7 వాద్యసమ్మేళనం 7-15 తమిళ వా. 7-30 ఉదయగానం (బి) 8-15 కె. జానకి.

మ॥ 1 ఎ. ఐ. ఆర్. వాద్యగోష్ఠి 1-30 (బి) 1-40 హిందీ వా. 1-50 (బి) 2 తమిళ వా. 2-10 (బి) 2-30 తేవారమ్ 3 సుశీలా అమ్మయ్యర్ చిత్తూర్ గోపాలకృష్ణన్- వయొలిన్ కల్యాణరామ స్వామి-మృదంగం.

సా॥ 5 పాశ్చాత్య సంగీతం (బి) 5-30 హెచ్. శంకర భాగవతర్ 6 కె ప్రాంతీయ వా॥ 6-15 ఆర్. పట్టమ్మాళ్- వీణ 6-45 జి. సుబ్బులక్ష్మి 7-15 తమిళ వా. 7-30 సంధ్యాగానం (బి) 7-45 తిరుచి వలె 8 ప. రూర్ అనంతరామయ్యర్-వయొలిన్ 9 తుకైయర్ రాజగోపాలశర్మ 9-45 పాశ్చాత్య సంగీతం (బి) 10-30 ప్రసార సమాప్తి.

మద్రాస్ (బి)

ఉ॥ 7 తెలుగు వా 7-15 ఉదయ సంగీతం (బి) 7-30 పాపా మలర్ 8 ఇంగ్లీషు వా 8-15 వృత్తినాటకం (మలయాళమున) నిర్వహణ: గోపీనాథ్ 8-30 సుప్రభాత్ : శ్రీ రామకల్యాణం (వాల్మీకి రామాయణం) 8-45 కన్నడ నాటిక.

10 అ॥ భా॥ సంగీత కార్యక్రమం.

మ॥ 1 ఎ వలె 1 30 ఇంగ్ వా 1-40 (బి) 1-50 తెలుగు వా 2 వేణువు 2-15 ఆట విడుపు 3 ఎ వలె

సా॥ 5 ఎ వలె 6-00 స్థానిక ప్రకటనలు 6 ఇంగ్ల వా 6-05 ప్రాంతీయ వా 6-15 గ్రామస్థుల కార్యక్రమం ఝాన్సీరాణి (బుర్రకథ) 7 తెలుగు వా 7.15 బుర్రకథ 7-30 శ్రోతల పరిచయం 7-45 ఎ వలె 8-30 ఢిల్లీ వలె 8-45 ఎ వలె 9 ఇంగ్ల వా 9-15 పుస్తకసమీక్ష (ఇం) 9-30 పండితారాధ్య చరిత్రలోని వివిధ విషయ జ్ఞానము (ప్రసంగం) 9-45 శ్రోతలుకోరిన పాటలు (బి) 10-30 ప్రసార సమాప్తి.

హైదరాబాద్

ఉ॥ 6-50 సుప్రభాత్ 6-55 కార్యక్రమ వివరణ 7 తెలుగు వా. 7-15 కర్ణాటక సంగీతం-ఉపద్రష్ట కృష్ణమూర్తి 7-30 హిందుస్థానీ సంగీతపాఠం. ఎం. ఆర్. గౌతమ్ 7-45 కన్నడ వా. 8 ఇంగ్ల వా. 8-15 హిందీ వా. 8 30 ఆవో బచ్చో 9-15 బాలవినోదం శబరి (నాటిక) మంథరమాయమాటలు !— శిరోమణి రామాయణకథ విజ్ఞాన వేతల గానలు ! న్యూటన్ 10 అ॥ భా॥ సంగీత కార్యక్రమం 11-30 ఝూలతి యా-హిందీలో వినోద కార్యక్రమం- నిర్వహణ వినోదశర్మ.

మ॥ 12-30 (బి) 12-50 మరాఠీ వా. 1 ఖయాల్ 1-30 (బి) 1-50 తెలుగు వా.

సా॥ 5-30 ఖయాల్ 5-45 ఘజల్, కీర్ 6 మరాఠీలో కార్యక్రమం 6-30 భక్తిభావ్ (బి) 6-40 స్థానిక ప్రకటనలు 6-45 గీతావళి-ఎస్. నాగేశ్వరరావు 7 తెలుగు వా. 7-15 గ్రామసీమ. రాణీ సంయుక్త-బుర్రకథ 7-45 భజన్ 8 భారత రష్యా దేశముల మైత్రీక్రమ (ప్రసంగం) 8-15 వాద్యత్రయం- వీణ, వయొలిన్, వేణువు 8-30 ఢిల్లీ వలె 8 45 కె. పుష్ప 9 ఇంగ్ల వా. 9-15 ఉర్దూ వా, 9-30 రసమయి (మదరాస్ వలె) 9-45 కె. పుష్ప 10-30 ప్రసార సమాప్తి.

# నరవలో అగ్ని ప్రమాదం

విజయనగరం, ఏప్రిల్ 17: నరవ గ్రామంలో నిన్న ఘోరమైన అగ్నిప్రమాదం సంభవించింది 250 ఇళ్లు కాలిపోయాయి. గ్రామప్రజలు మైలుదూరంలో వున్న తోటలో తల దాచుకోవలసి వచ్చింది. 10 హరిజన గృహాలు మాత్రం మిగిలాయి. రు 50 వేల ఆస్తి నష్టం జరిగింది. పశుగ్రాసం, తిండిగింజలు కూడా కాలిపోయాయి. పరిసర గ్రామస్థులు భోజన సదుపాయాలు చేశారు.

సహాయానికై శ్రీ లకవరపు కోట అప్పలస్వామి విజ్ఞప్తి చేస్తున్నారు.

# అనేకసార్లు అమ్మకం పన్నువేసే పద్ధతి విఫలమైంది

## చిత్తూరు జిల్లా వర్తకుల విజ్ఞప్తి

తిరుపతి, ఏప్రిల్ 18: ఒకేవస్తువుపై అనేకచోట్ల అనేకసార్లు అమ్మకం పన్ను విధించే పద్ధతి 18 సంవత్సరాలుగా అమలులో ఉన్నా విఫలమైందని వివరించుతూ నెల్లూరు మకాంలో ఆంధ్రరాష్ట్ర అమ్మకంపన్ను విచారణ సంఘానికి చిత్తూరుజిల్లా వస్త్రాల వర్తకులు ఒక విజ్ఞప్తి సమర్పించారు.

అనేకచోట్ల అమ్మకంపన్ను విధించే పద్ధతివల్ల కలుగుతున్న కష్టాలను విజ్ఞప్తిలో వివరించారు. ప్రజలు చెల్లించగలరా లేదా అనే సంగతి ఆలోచించకుండా నిత్యజీవితావసర వస్తువులపైకూడా పన్నులు విధించుతున్నందున ప్రభుత్వానికి రావలసిన ఆదాయం సక్రమంగా రావడం లేదని విజ్ఞప్తిలో ఉన్నది. ఆ తర్వాత అమ్మకంపన్ను చట్టానికి ఆంధ్ర ప్రభుత్వం ఇంతవరకు చేసిన రెండు సవరణలవల్ల ఏర్పడిన చిక్కులను వివరించారు. ఆదాయాభివృద్ధికి అమ్మకంపన్నుపై కాక ఇతర పద్ధతులపై ఆధారపడమని ప్రభుత్వానికి సూచించారు.

రాష్ట్ర అమ్మకంపన్ను చట్టంనుంచి మిల్లు వస్త్రాలను మినహాయించి, రకరకాల వస్త్రాలపై దేశం మొత్తం మీద ఒకేఒక రకంపన్ను కేంద్రప్రభుత్వమే ఎక్సయిజు సుంకంగా వసూలుచేస్తే బాగుంటుందన్నారు.

### పంచాయతీల వార్షికోత్సవం

గూడూరు, ఏప్రిల్ 16: గూడూరు తాలూకా పంచాయతీల వార్షికోత్సవం సెల్లటూరు గ్రామంలో నిన్న జరిగింది. తహసీల్దారు శ్రీ ఆర్. కృష్ణమూర్తి అధ్యక్షత వహించారు. పంచాయతీల ప్రతినిధులనేకమంది పాల్గొన్నారు. ఉదయం ఆటల పోటీలు జరిగినవి. సాయంకాలం జరిగిన సభలో శ్రీయుతులు చంద్రశేఖరరెడ్డి, సి. వి. కృష్ణయ్య, ఎస్. నరసింహారావుగారలు ప్రసంగించారు. కుమారి జి. సీతారామమ్మ హాటకచ్చేరీ చేశారు. ఆమెకు రజతపాత్ర బహూకరించారు. ఉత్తమ పంచాయతీలుగా నిర్ణయించిన కోట పంచాయతీ, పారిచెర్లవారిపాలెం పంచాయతీ, మంగళపూరు పంచాయతీలకు సంఘం తరఫున షీల్డులు బహూకరించారు. విచిత్ర వేషధారణ, ఆటల పోటీలలో గెలుపొందినవారికి బహుమతులు పంచిపెట్టారు.

### లంకభూములను వేలంవేసే పద్ధతి

#### విరమించవలసి విజ్ఞప్తి

కొల్లూరు, ఏప్రిల్ 16: కృష్ణ లంకభూములను ముఖ్యంగా తెనాలి, రేపల్లె, గుంటూరు, సత్తెనపల్లి, బెజవాడ, నందిగామ, గన్నవరం, దివి తాలూకాలలోని భూములను వేలంవేసే పద్ధతిని విరమించి ఇంతవరకు సేద్యంచేస్తున్న వ్యవసాయ కూలీ సహకారసంఘాలకు పట్టాలు ఇప్పించమని ప్రభుత్వాన్ని కోరుతూ ఇక్కడ జరిగిన సమావేశంలో తీర్మానించారు. సమావేశానికి శ్రీ గుంటూరు బాపనయ్య అధ్యక్షత వహించారు. గుంటూరు, కృష్ణాజిల్లాల్లోని లంకభూములను సాగుచేస్తున్న వ్యవసాయ కూలీ సహకారసంఘాల 600 మంది సభ్యులు సమావేశానికి వచ్చారు.

సభ్యులకు శ్రీ జి. జోసఫ్ స్వాగతం చెప్పారు. సభను శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య ప్రారంభించారు. శ్రీయుతులు తురిమెళ్ళ గోవిందయ్య, వై. తిరుపతయ్య మొదలైనవారు మాట్లాడారు.

లంకభూములను సాగుచేస్తున్న వ్యవసాయ కూలి సహకారసంఘాలన్నింటిని కేంద్రబ్యాంకులలో సభ్యులుగా చేర్చుకుని అప్పులు ఇచ్చే ఏర్పాటు చేయండమని ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానించారు.

సమావేశం నిర్ణయించిన కార్యక్రమం విషయమై కృషిచేసేందుకు శ్రీయుతులు జి. జోసఫ్, తురిమెళ్ళ గోవిందయ్య, కోట వెంకటరత్నం, చేతిపూడి ముత్తయ్య, పి. తిరుపతయ్య, కె. దేవసుందరం, కె. అర్జున, గంజి రామారావుగారలతో ఒక సంఘాన్ని నియమించారు.

ఆరాత్రి శ్రీ బాపనయ్య అధ్యక్షతన జరిగిన బహిరంగసభలో శ్రీ గోపాలకృష్ణయ్య ప్రసంగించారు.

### పాకిస్తాన్‌లో ఈయేడు ఆఖరులో ఎన్నికలు

లాహోర్, ఏప్రిల్ 19: పశ్చిమ పాకిస్తాన్ శాసనసభను రద్దుపరిచినా సరే పాకిస్తాన్‌లో ఎన్నికలను ఈ సంవత్సరాంతంలోనే కాని ముందు జరపబోరని ముఖ్యమంత్రి డా॥ ఖాన్ సాహెబ్ తెలియచేశారు.

మంత్రివర్గంలో చేరవలసిన కలాఖాగ్ నవాబు చేరడం లేదనికూడా తెలియచేశారు.

### రాయలసీమలో రైలుమార్గాలు

#### కడపజిల్లా సోషలిస్టుల విజ్ఞప్తి

కడప, ఏప్రిల్ 18: పాకాల నుంచి నంద్యాలవరకు వేయదలచిన రైలుమార్గానికి బదులు పాకాలనుంచి పీలేరు, రాయచోటి, లక్కిరెడ్డిపల్లి, వేంపల్లి, ఎల్లగుంట్ల, ప్రొద్దుటూరు, కోయిలకుంట్ల, బనగానిపల్లి, బేతంచెర్ల మీదుగా కర్నూలుకు వేయించమని కేంద్రప్రభుత్వాన్ని కోరుతూ ఈ నెల 15న మైదుకూరులో జరిగిన సమావేశంలో కడపజిల్లా సోషలిస్టు పార్టీ కార్యకర్తలు తీర్మానించారు. సమావేశానికి శ్రీ ఎం. వెంకటసుబ్బారెడ్డి అధ్యక్షత వహించారు.

మే నెలలో రాయలసీమ ప్రాంత సోషలిస్టు పార్టీ కార్యకర్తలకు మైదుకూరులో 15 రోజులు శిక్షణ శిబిరం నిర్వహించాలని నిర్ణయించారు. రాయలసీమ అభివృద్ధికి వినియోగపడే నీటి పారుదల సౌకర్యాలను రెండవ పంచవర్ష ప్రణాళికలో ఇంకా ఎక్కువగా జరిపించమని మరొక తీర్మానంలో ప్రభుత్వాన్ని కోరారు. బుగ్గమేరుకు రిజర్వాయర్ నిర్మించే ఏర్పాటు చేయించమని కోరుతూ తీర్మానించారు.

నెల్లూరునుంచి మైదుకూరు వరకు వేయదలచిన రైలుమార్గాన్ని ప్రొద్దుటూరు, ఎర్రగుంట్ల, పులివెందల, పార్నపల్లి, ధర్మవరంల మీదుగా బెంగుళూరు వరకు పొడిగించమని కేంద్ర రైల్వే మంత్రిని అభ్యర్థించుతూ కూడా తీర్మానించారు.

### చింతలపూడి తాలూకాలో బంజర్ల పంపిణీ

ఏలూరు, ఏప్రిల్ 14: తాలూకాలోని బంజరు భూములను నిరుపేదలకు సమంగా పంపిణీ చేయించమని, మల్లేశ్వరం, శివపురం గ్రామాలలోని వ్యవసాయదారులకు మత్రి బంధను చెరువు కింది భూములకు పట్టాలు ఇప్పించమని ప్రభుత్వాన్ని కోరుతూ ఈ నెల 11న జరిగిన అవసర సమావేశంలో చింతలపూడి తాలూకా ఆంధ్ర లేబర్ సంఘం తీర్మానించారు. సమావేశానికి శ్రీవెలమర్తి శిఖామణి అధ్యక్షత వహించారు. దాదాపు వందమంది సభ్యులు సమావేశానికి వచ్చారు.

సంఘం ఆశయాలను వివరించుతూ రాష్ట్ర సంఘం ప్రధాన కార్యదర్శి శ్రీ ఎం ఇ. అజరయ్య ప్రసంగించారు.

ఆ తర్వాత తాలూకా సంఘానికి ఈ క్రింది తాత్కాలిక కార్యవర్గం ఎన్నికైనారు. అధ్యక్షుడు-శ్రీ రావాడ వెంకయ్య, సభ్యులు శ్రీయుతులు గారపాటి వాగభూషణం, లివగాల రాజరత్నం, కొండ్రు శేషయ్య గారలు. మరి కొందరు సభ్యులను చేర్చుకోవాలని కూడా నిర్ణయించారు.

# మళ్లింపు కాలవతో రిజర్వాయర్ అవసరం

## ఆకివీడు రైతుసభ విజ్ఞప్తి

ఆకివీడు, ఏప్రిలు 17: కొల్లేరు వరదవల్ల ప్రతి సంవత్సరం రైతులకు కలుగుతున్న నష్టాన్ని నివారించడానికి వీలుగా బుడమేరు మళ్ళింపుకాలవతోపాటు రిజర్వాయర్ కూడా నిర్మించవలసిన అవసరం వివరించుతూ ఉపముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డికి కొల్లేటి రైతుల తరఫున భీమవరం, కైకలూరు తాలూకాల సోషలిస్టుపార్టీ ఒక విజ్ఞప్తి సమర్పించారు.

కొల్లేరు ప్రాంతంలో దాళ్వా పంటకు నీరు సప్లయిచేసే సందర్భంలో చేయవలసిన ఏర్పాట్లను వివరించుతూ ఉపముఖ్యమంత్రికి భీమవరం తాలూకా సోషలిస్టుపార్టీ మరొక విజ్ఞప్తి సమర్పించారు.

తమ్మిలేరు, రామిలేరు, మొండికోడి మురుగుకాలవ, ఎర్ర కాలవలకు రిజర్వాయర్, మళ్లింపు కాలవలను ఒకేసారి నిర్మించడం అవసరమని కొల్లేటి రైతుల తరఫున సమర్పించిన విజ్ఞప్తిలో ఉపముఖ్యమంత్రికి వివరించారు. ఉప్పుటేరు వెడల్పు ఎక్కువ చేయించమని అభ్యర్థించి బుడమేరు, తమ్మిలేరు, ఎర్రకాలవలపై రిజర్వాయర్‌లను వీలైనంత త్వరగా నిర్మించమని విజ్ఞప్తి చేశారు.

బుడమేరు రిజర్వాయిర్ నిర్మాణంవల్ల కలిగే ప్రయోజనాలను, కేవలం మళ్ళింపుకాలవ ఒక్కటే త్రవ్వించితే 28 వేల ఎకరాలకు ముంపు ప్రమాదం తప్పుతుందనే విషయంలోని సత్యాసత్యాలను చర్చించుతూ, భీమవరం తాలూకా కొల్లేటి రైతు మహాసభ తరఫున ఉపముఖ్యమంత్రికి మరొక విజ్ఞప్తి సమర్పించారు. కొల్లేరులో నెలలతరబడి నీరు ఎట్లా నిలిచిపోతున్నదీ వివరించారు. కొల్లేరు సరస్సులోని నీరు త్వరగా సముద్రంలోకిపోయేమార్గం లేకపోవడంవల్ల కృష్ణాజిల్లాలోని బుడమేరు, పశ్చిమగోదావరిజిల్లాలోని ఎర్రకాలవ, తమ్మిలేరు, ఎనమదుర్రు మురుగు కాలవ ప్రాంతాలలోని నీరు త్వరగా కొల్లేరుకు రావటంగాని, ఆ ప్రాంతాలలోని మురుగునీరు తగ్గే అవకాశంకాని ప్రస్తుతం లేదు. కనుక ఉప్పుటేరు వెడల్పు ఎక్కువచేసి కొల్లేటి నీరు త్వరగా సముద్రంలోకిపోయే ఏర్పాటు చెయ్యాలి. బుడమేరు, రామిలేరు, తమ్మిలేరు, ఎర్రకాలవల నీరంతా కొల్లేరుకు చేరే ఏర్పాటు చెయ్యాలి. ఈ నీరంతా ఉప్పుటేరు ద్వారా సముద్రంలోకి పోవాలి కనుక ఉప్పుటేరును తక్షణం బాగుచేయించడం అవసరం. రిజర్వాయిర్లను నిర్మించినా, మళ్లింపు కాలవలను త్రవ్వించినా నీరంతా చివరికి కొల్లేరుకే వస్తుంది. ఆ ప్రాంతంలోని చేలను ముంచి వెయ్యడానికి చాలు. అందుకనే ఉప్పుటేరును తక్షణం బాగుచేయించడం అవసరం. బుడమేరుకు రిజర్వాయిర్ నిర్మించి, దఫాలుగా దీన్ని నీటితో నింపి ముంపు ప్రమాదం తప్పించవచ్చునని చెబుతున్నారు.

అయితే మళ్ళింపు కాలవకు దిగువన యాభై అరవై మైళ్ళ బుడమేరు, ఆ ప్రాంతంలోని సుమారు 500 చదరపు మైళ్ళ నీరు కొల్లేరుకే వస్తుందనే సంగతి గమనించక ఇట్లా చెబుతున్నారు. వీటన్నింటివల్ల లక్షలాది ఎకరాలనుంచి మురుగు నీరు అవతలికి వెళ్లే కొల్లేరు - ఉప్పుటేరు పథకానికే అధిక ప్రాముఖ్యం ఇవ్వాలని తెలుపుతున్నదని విజ్ఞప్తిలో వివరించి, బుడమేరు మళ్లింపు కాలవకు దిగువన కరకట్టలను బలంచేస్తే కొల్లేరు, ఉప్పుటేరు ప్రాంతాలకు ఇంకా ప్రమాదం వస్తుందన్నారు. కరకట్టలను బలంచేసే బదులు ఉప్పుటేరునే బాగుచేయించాలన్నారు.

ఈ విజ్ఞప్తిలో సూచించిన ఏర్పాట్లివి: (1) బుడమేరు కొల్లేరులో కలిసేచోటునుంచి ఉప్పుటేరు వరకు కాలవ త్రవ్వించి ఉప్పుటేరును అభివృద్ధి చెయ్యాలి. ఆతర్వాత అవసరాన్ని బట్టి బుడమేటి కరకట్టల విషయాన్ని పరిశీలించాలి. (2) కొల్లేరు ఉప్పుటేరుల తో కలిపిన బుడమేరు సమగ్ర పథకాన్నే అమలుచేయించాలి. (3) బుడమేరు మళ్లింపుకాలవ వల్ల 28 వేల ఎకరాలకు ముంపు ప్రమాదం తప్పుతుందనడం అనుభవ విరుద్ధమైన సంగతి. (4) అవరోధమేమీ లేకుండా కొల్లేరు నీరు సముద్రంలోకి వెళ్ళడానికి వీలుగా లక్ష్మీపురం నుంచి సముద్రానికి కొత్త కాలవ త్రవ్వించాలి. (5) ఎనమదుర్రు మురుగుకాలవ ఉప్పుటేరులో కలిసేచోటికి సముద్రం 2 మైళ్లలో ఉన్నది. అక్కడినుంచి ఉప్పుటేరు 8 మైళ్లు. అందుకని లక్ష్మీపురంనుంచి సముద్రానికి తవ్వే 8 మైళ్ళ కాలవను ఈ రెండుమైళ్లు పొడిగిస్తే కొల్లేరులోనిచేనీరు తగ్గడమేకాక, సముద్రానికి త్వరగా నీరువెళ్ళే అవకాశం ఉంటుంది. అంతేకాక నరసాపురం తాలూకాలోని మురుగుకాలవల నీరుకూడా త్వరగా సముద్రంలోకి వెళుతుంది. (6) ఇటువంటి సమగ్ర పథకంవల్ల కృష్ణాపశ్చిమ గోదావరిజిల్లాలకు ముంపు ప్రమాదం తప్పిపోవడమేకాక కొత్త భూమికూడా సాగులోకి వస్తుందికనుక అవసరాన్ని బట్టి అభివృద్ధిపన్ను ఇస్తాం.

### ఆంధ్రలో నీటి వనరులు

#### ప్రభుత్వం చేస్తున్న పని

#### తొందరగా అయ్యేవి ముందు ప్రారంభం

భీమవరం, ఏప్రిల్ 17: ప్రాజెక్టు పనులను ప్రారంభించడ మేమంత తేలికపనికాదు, నిపుణులసలహాతో పథకాలనుజాగ్రత్తగాపరిశీలించడానికి రెండు సంవత్సరాలు పట్టింది. ముఖ్యంగా నీటి పారుదల సౌకర్యాల పథకాలన్నింటిని అమలు జరిపించడానికి అధికారంలోకి వచ్చినప్పటి నుంచి శాయశక్తులా కృషి చేస్తున్నాను." అని ఇక్కడ జరిగిన కొల్లేరు రైతుల సభలో బుడమేరు పథకాలను అమలు జరిపే విషయమై వస్తున్న విమర్శలకు ఉప ముఖ్య మంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి సమాధానం చెప్పారు. సభకు ఆంధ్ర కాంగ్రెసు కార్యదర్శి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి అధ్యక్షత వహించారు. ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ అల్లూరి సత్యనారాయణ రాజుకూడా సమావేశానికి వచ్చారు. వేలాది కొల్లేరు ప్రాంత రైతులు ఆకివీడులో సమావేశమై చేసిన తీర్మానాలను జిల్లా కాంగ్రెసు కార్యదర్శి శ్రీ శేషగిరి రావు ద్వారా మంత్రికి అందజేశారు.

విజ్ఞప్తికి సమాధానం చెబుతూ బుడమేరు పథకాలను అమలుచేసే విషయమై వస్తున్న విమర్శలను మంత్రి ఖండించారు. అటువంటి విమర్శలన్నీ నిరాధారాలని ఇట్లా వివరించారు:

"నేను మంత్రిని అయినప్పటినుంచి అభివృద్ధి పథకాలన్నింటిని ముఖ్యంగా ఆహారధాన్యాల ఉత్పత్తిని ఎక్కువ చేసే నీటి పారుదల సౌకర్యాల పథకాలన్నింటిని అమలు జరిపించేందుకు శాయశక్తులా కృషిచేస్తున్నాను. ఈ పథకాలను అమలు జరిపేందుకు నిపుణుల సలహాతో జాగ్రత్తగా పరిశీలనలు జరిపించడం అవసరం. ఒక ప్రాజెక్టుపని ప్రారంభించడం ఏమంత తేలికకాదు."

"రెండు సంవత్సరాలు దర్యాప్తు చేయించి మన రాష్ట్రం అవసరాలను స్వయంగా కేంద్రప్రభుత్వానికి నేను నచ్చ చెప్పవలసి వచ్చింది. చివరికి ఎట్లా అయితేనేం ఈ పథకాలకు మన రాష్ట్రానికి రు 50 లక్షల ప్రారంభ కేటాయింపు సంపాదించాం."

"ఆయా శాఖలలోని ఇంజనీర్ల సముచిత సలహాలతో చాలా పథకాలను జయప్రదంగా అమలు చేయించగలిగాం. తొందరగా పూర్తయ్యేవాటికి ప్రథమ ప్రాముఖ్యం ఇస్తున్నాం. అందువల్లనే సుమారు 25 వేల ఎకరాలకు పూర్తినష్టాన్ని నివారించి, కొల్లేరు నీటిమట్టాన్ని దాదాపు 14 అంగుళాలు తగ్గించే బుడమేరు మళ్ళింపుపథకాన్ని మొదట ప్రారంభించాం. ఎర్రకాలవ, తమ్మిలేరు, ఉప్పుటేరు పథకాల పరిశీలను దాదాపు ఆరు నెలల్లో పూర్తి అవుతవి. తుదినిర్ణయం జరగ్గానే ఉప్పుటేరు వెడల్పు ఎక్కువచేసే పని ప్రారంభమవుతుంది. ప్రాంతీయ తత్వాలకు, పార్టీ దృష్టికీ మా మంత్రివర్గంలో చోటు లేదు. మొదట ప్రకాశం పంతులుగారు రూపొందించిన బుడమేరు పథకాన్ని, కొల్లేరు పథకాన్ని అమలుజరిపించాలన్న శ్రద్ధ నాకు ఇతర మంత్రులకూ ఉన్నది.'

ఆటు తర్వాత కేంద్రప్రభుత్వం అనుమతించేవరకూ ఆగకుండా కృష్ణా బరాజ్ నిర్మాణం పని ఏవిధంగా ప్రభుత్వం ప్రారంభించినదీ మంత్రి వివరించారు.

కొల్లేరు రైతుల ఇబ్బందులను నివారించే విషయమై ప్రభుత్వానికిగల శ్రద్ధను వివరించుతూ శ్రీ అల్లూరి సత్యనారాయణరాజు ప్రసంగించారు. శ్రీ శేషగిరిరావు వందన సమర్పణ చేశారు.

### హైదరాబాదు చెరకు రైతుల స్థితి

#### శాసనసభలో వాయిదా తీర్మాన నిరాకరణ

హైదరాబాద్, ఏప్రిల్ 18:— రాష్ట్రంలో చెరకు ఉత్పత్తిదారుల చిక్కులను ప్రస్తావించుతూ సోషలిస్టు సభ్యుడు శ్రీ సి. రాజారామ్ ప్రతిపాదించదలచిన విరామ తీర్మానానికి శాసనసభ సభాపతి శ్రీ కె. ఎస్. వైద్య శాసనసభలో నేడు అనుమతి నిరాకరించారు.

చెరకు ఉత్పత్తిదారులకు రావలసిన బోనస్ నుంచి మణుక్కు 3 పైసలను మినహాయించి, పండించవలసిన చెరకు పంట కోటాను ఎక్కువ చెయ్యాలని నిజామ్ చక్కెర ఫ్యాక్టరీ యజమానులు నిర్ణయించినందున చెరకు పండించే రైతులకు కలిగే చిక్కులను విరామ తీర్మానంలో చర్చించగోరారు. ఫ్యాక్టరీ యజమానులు చేసిన నిర్ణయంవల్ల చెరకుపంట దెబ్బతినక తప్పదని అన్నారు.

ప్రతిపాదనలోని విషయం ఫ్యాక్టరీకి, ఉత్పత్తిదారులకు సంబంధించిన వ్యవహారమని ప్రభుత్వానికేమీ సంబంధం లేదని, పైగా అంత అత్యవసర విషయమూ కాదని ప్రతిపాదనకు అనుమతి నిరాకరించుతూ సభాపతి అన్నారు.

అంతకు ముందు తీర్మానాన్ని సభలో ప్రతిపాదించడానికి అనుమతి ఇవ్వరాదని వాదించుతూ ప్రతిపాదనలోని వ్యవహారం 1953-54 వ సంవత్సరానికి సంబంధించినది కనుక ముఖ్యమైంది కాదని వాణిజ్య పరిశ్రమలశాఖ మంత్రి శ్రీ వినాయకరావు అన్నారు.

తమకు ఇచ్చే బోనస్‌నుంచి మణుక్కు 3 పైసలను మినహాయించి ఆ సొమ్మును చెరకు ఉత్పత్తిదారులసంఘానికి ఇవ్వమని ఫ్యాక్టరీ యజమానులను కోరుతూ చెరకు ఉత్పత్తిదారుల సంఘం తీర్మానించారు. అంతకుముందు చెరకు మణుగు ధరను రు 1-8-0 నుంచి రు 1-10-3 కు పెంచారు.

శ్రీ వినాయకరావు ఇట్లా చెప్పారు: "చెరకు ఉత్పత్తిదారుల పంచాయతీ ఇటీవలనే ఏర్పాటయింది. 600 మంది ఉత్పత్తి దారులకుగాను 112 మంది అందులో సభ్యులుగా చేరారు. ఆ సంఘానికి అధ్యక్ష, కార్యదర్శులు సోషలిస్టుపార్టీకి చెందిన ఇద్దరు శాసన సభ సభ్యులు. అంటే సోషలిస్టుల ఆధ్వర్యాన రాజకీయసంస్థగా ఆ సంఘంపని చేస్తున్నదన్నమాట. ఫ్యాక్టరీ యజమానులు మొత్తం రు 65,965 మినహాయించగా అందులో రు 1276 విషయం మాత్రమే చెరకు ఉత్పత్తిదారుల పంచాయితీ తగాదా పడుతున్నది. మొత్తం చెరకు ఉత్పత్తిదారులలో నూటికి ఇద్దరికంటే ఎక్కువమందికి ఆ సంఘం ప్రాతినిధ్యం వహించడంలేదు."

సంవత్సరాలుగా ఆ సంఘం పనిచేస్తున్నదని, సభకు తమ పార్టీపై దురభిప్రాయాలుకలిగించడానికి మంత్రిప్రయత్నించారని శ్రీ రాజారాం ఆరోపించారు.

కేంద్ర ప్రభుత్వ ఆహారశాఖమంత్రి కిందటిసారి ఇక్కడికి వచ్చినప్పుడు ఆ సంఘం ప్రదర్శన జరిపింది. ఒక నెల కిందటనే ఆసంఘం ఏర్పడిందనడంపొరపాటని కూడా వాదించారు. శ్రీ రాజారాం ఇంకా ఇట్లా అన్నారు: "పంచాయతీలను ఏర్పాటుచేసి పనిచేయించే హక్కు సోషలిస్టు పార్టీకి, తదితర రాజకీయ పార్టీలకు ఉన్నది. చెరకు ఉత్పత్తిదారుల సంఘానికి సభ్యత్వం లేదు. కొకవాతే కొంతమంది పలుకుబడి గలవారి ప్రాపకం మాత్రం ఆ సంఘానికి ఉన్నది."

#### సమావేశం ముగింపు

హైదరాబాదు రాష్ట్ర శాసనసభ సమావేశాన్ని ముగింపచేస్తూ రాజప్రముఖ్ నేడు ఉత్తరువులిచ్చారు. 41 రోజులు జరిగిన ఈ సమావేశంలో బడ్జెట్‌ను, 14 బిల్లులను శాసన సభ ఆమోదించింది. బొంబాయి నగరాన్ని మహారాష్ట్రంలో కలపాలన్న ముఖ్య సవరణలో రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ బిల్లు ముసాయిదాను శాసనసభ ఆమోదించింది.

అక్టోబరు మొదటి తేదీన రాష్ట్రం భాషా ప్రాంతాలుగా విడిపోతున్నందున ఈలోగా శాసన సభ మరొకసారి కొద్ది రోజులపాటు సమావేశమవుతుందని ముఖ్యమంత్రి డాక్టరు రామకృష్ణరావు ప్రకటించారు.

గత నాలుగున్నర సంవత్సరాలలో రాష్ట్రంలో జరిగిన అభివృద్ధి, మొదటి పంచ వర్ష ప్రణాళిక కాలంలో జరిగిన అభివృద్ధి పనులను తెలుసుకోవడానికి వీలుగా ప్రాజెక్టు ప్రాంతాలు, తదితర అభివృద్ధి కేంద్రాల పర్యటనకు రమ్మనమని సభ్యులను ముఖ్యమంత్రి ఆహ్వానించారు. పర్యటన ఖర్చు ప్రభుత్వమే భరిస్తుంది. సభ్యులు జట్లు జట్లుగా నైనా వెళ్ళవచ్చు. లేదా అందరూ కలిసి అయినా వెళ్ళవచ్చు. జూలై మొదటి రెండు వారాలలో అయితే పర్యటన చాలా బాగుంటుంది. పర్యటన కార్యక్రమం వివరాలను తయారుచేసేందుకు 7 గురు సభ్యులతో ఒక సంఘాన్ని ఏర్పాటు చేస్తున్నానని ముఖ్యమంత్రి వివరించారు. ముఖ్యమంత్రి ప్రకటనకు సభ్యులు హర్షం ప్రకటించారు.

### కాంగ్రెసు ప్రాథమిక సభ్యత్వం

తెనాలి, ఏప్రిల్ 17: ఈ సంవత్సరానికి కాంగ్రెసు ప్రాథమిక సభ్యుల చేర్పించే గడువు జూన్ ఆఖరులోగా పూర్తికావాలని కార్యకర్తలకు తాలూకా కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి శ్రీ రావిపాటి ఆంజనేయులు తెలుపుతున్నారు.

### తమ్ముని చంపిన నేరానికి శిక్ష

గుంటూరు, ఏప్రిల్ 17: తమ్ముని చంపిన నేరానికి కొండవీటివారిపాలెం గ్రామస్థుడు ఘంటా అంకమ్మ అనే ఆసామికి రెండున్నర సంవత్సరాల కఠినశిక్ష విధించుతూ గుంటూరు జిల్లా సెషన్సు జడ్జి శ్రీ హెచ్. ఎ. అయ్యర్ తీర్పు చెప్పారు.

నేరారోపణలు చెప్పినదిది: ముద్దాయి, అతని తమ్ముడు కొండవీటి వారిపాలెం గ్రామం బయట ఒక డొంకలో కాపురం ఉంటున్నారు. నేరం జరిగిన రోజున ఈ అన్నదమ్ముల పిల్లల మధ్య వచ్చిన తగాదా వారి తల్లుల దాకా వెళ్ళింది. ఆ సంగతి తెలుసుకొని అన్నదమ్ములిద్దరూ ఘర్షణపడ్డారు. అన్న తమ్ముణ్ణి గొడవలితో పొడిచాడు. తమ్ముడు చనిపోయాడు. ముద్దాయి తరఫున ప్రభుత్వ న్యాయవాదిగా శ్రీ డి. యస్. ఆర్. శాస్త్రి వాదించారు.

### అనంతపురం నూనెగింజల పరిశోధనా కేంద్రం

#### నూతన భవన ప్రవేశోత్సవం

అనంతపురం, ఏప్రిల్ 16: ఇక్కడికి సమీపంలోని ప్రసన్నయ్యపల్లి గ్రామంలో ప్రభుత్వం ఏర్పాటుచేసిన ప్రాంతీయ నూనెగింజల పరిశోధనా కేంద్రం నూతన భవన ప్రవేశోత్సవం వ్యవసాయ శాఖమంత్రి శ్రీ కందుల ఓబులరెడ్డి జరిపారు.

శ్రీయుతులు పి. ఆంటోనిరెడ్డి, ఎ. చిదంబరరెడ్డి, కె. వి. వేమారెడ్డి, కె. అశ్వత్థప్ప గారలుకూడా వ్యవసాయ శాఖమంత్రి వెంట ఇక్కడికి వచ్చారు. గ్రామస్థులు, నూనెగింజలశాఖ ప్రతినిధులు శ్రీ ప్రభాకరరెడ్డి మంత్రికి స్వాగతం చెప్పారు. కేంద్రంలోజరుగుతున్న పనులను మంత్రికి తదితరులకు శ్రీ ప్రభాకరరెడ్డి చూపించారు. కేంద్రాన్ని సక్రమంగా వినియోగించుకుని ప్రయోజనం పొందమని రైతులకు మంత్రి సలహాచెప్పారు. సభకు శ్రీ ఆంటోనిరెడ్డి అధ్యక్షత వహించారు. కేంద్రంలో జరిగే కృషిని వివరించే ప్రదర్శనకూడా ఏర్పాటు చేశారు.

## గంటలపంచాంగం

శ్రీ దుర్ముఖి సం॥ చైత్ర శు॥ ఏకాదశి 1956- సం॥ ఏప్రిల్ 21 శనివారం శు॥ ఏకాదశి 10.23 పూ ఫ 22-19 వర్జ్యం 6-50 ల 8-23 దు.
శు॥ ద్వాదశి ఏప్రిల్ 22 ఆదివారం ఆ॥ ద్వాదశి 9-1 ఉ ఫ 21-50 వర్జ్యం శే 6-57 దు.

ఆంధ్రపత్రిక

ఒరు లేయని యొసరించిన
వరవర యుప్రియము తన మనంబున కగు దా
వొరులకు వని సేయకునికి
పరాయణము పరమధర్మపథములకెల్లన్
(మహాభారతము)

దుర్ముఖి సం॥ చైత్ర శు॥ ఏకాదశి
శనివారం

## దివ్యాంజలి

నిద్రాణమైవున్న ఆంధ్ర జాతిని మేల్కొలిపి నిరంతర కృషిద్వారా తిరిగి జాగ్రదవస్థకు తెచ్చిన మహామహుడు మన దేశోద్ధారకుడు; అనేక విధాల వెనుకబడివున్న ఆంధ్రులకు సాటి భారతీయులలో సముచిత గౌరవస్థానాన్ని సముపార్జించిపెట్టిన మహనీయుడు మన కళాప్రపూర్ణుడు; తరతమ భేదాలను సైతం పాటించక నిరంతర వితరణశీలిగా ఖ్యాతి గాంచిన మహాదాశయుడు మన విశ్వదాత. విశ్వదాత, కళాప్రపూర్ణ, దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులుగారు పరమపదించి నేటిలో సరిగా పద్దెనిమిది సంవత్సరాలు పూర్తి అవుతున్నవి.

దాదాపు రెండున్నర దశాబ్దాలపాటు ఆంధ్ర దేశంలో సాగిన అన్ని మహోద్యమాలకూ నాగేశ్వరరావు పంతులుగారు పట్టుగొమ్మగా నిలిచారు. వారు నడుముకట్టి ముందంజవేయనిదే ఆంధ్ర ప్రజాహిత జీవితంలో ఏ ఉద్యమమూ కొనసాగలేదంటే అతిశయోక్తి కాదు.

పంతులుగారు అజాత శత్రువు; నిష్కళంక, నిస్స్వార్థ దేశభక్తుడు; దీనజన సేనాపరాయణుడు. రాష్ట్ర స్థాపనానంతరం, రాష్ట్ర స్థాపనకు పూర్వం కూడా పంతులుగారు లేనిలోటు ఆంధ్ర రాజకీయ, సాంఘిక ఉద్యమ రంగాలలో గత పద్దెనిమిది సంవత్సరాలుగా మరీ ప్రస్ఫుటమైంది. అంతరంగికమైన స్పర్థలను ఎదుర్కొనవలసిన ప్రతిఘట్టంలోనూ పంతులుగారు జీవించి వుంటే పరిస్థితులు ఈ విధంగా పరిణమించేవి కావేమోనన్న భావమే అందరికీ ద్యోతకమవుతూ వచ్చింది. దేశోద్ధారకుని ఉదాత్త జీవిత లక్ష్యాలే దీనికి కారణం.

కొంతమంది తపస్సంపన్నులకు జీవితకాలంలోనే వారి తపస్సు ఫలిస్తుంది; కొందరికి ఆ అదృష్టం అబ్బదు. అయితే సంకల్ప శుద్ధితో సాగించిన తపస్సు వృథాపోదనే ఆత్మవిశ్వాసం మాత్రం వారికి వుండకపోదు. ప్రత్యేక రాష్ట్ర సాధనకు నాగేశ్వరరావు పంతులుగారు మిత్రులతో కలసి అహర్నిశలు కృషి చేశారు. ఆ కృషి ఫలించగానే వారి అనంతరం ఆంధ్రులకు ఒక రాష్ట్రం సిద్ధించింది. ఈ రాష్ట్రమే అచిరకాలంలో సువిశాల ఆంధ్ర రాష్ట్రంగా రూపొందబోతున్నది.

సువిశాల రాష్ట్రం అవతరించబోతున్న శుభ సమయానికి ముందుగా జరుగుతున్న పంతులుగారి పద్దెనిమిదవ వర్ధంతికి ఒక విధమైన ప్రత్యేకత వున్నదనే భావించాలి. అఖండాంధ్రం అవతరించి మూడుకోట్లమంది ఆంధ్రులు నవ భారత సమాఖ్యలో ఏక పరిపాలనా వ్యవస్థక్రిందికి వస్తున్నందుకు దివంగతులైన ఆంధ్ర నాయకులందరి ఆత్మలతోపాటు దేశోద్ధారకుని పవిత్రాత్మ కూడా అపరిమితంగా ఆనందించి తీరుతుంది.

సువిశాలమైన రాష్ట్రస్థాపనతోపాటు మన బాధ్యతలు కూడా ఇనుమడించబోతున్నవనే విషయాన్ని మరువకూడదు. ప్రాంతీయ, పాక్షిక, సంకుచిత దృక్పథాలను కట్టిపెట్టి మూడుకోట్ల ప్రజల సమైక్య శ్రేయోభివృద్ధిదృష్ట్యా రాష్ట్రపరిపాలనా కార్యకలాపాలను దీక్షతో, నిస్స్వార్థ బుద్ధితో నిర్వహించగలమని రుజువు చేయవలసిన బాధ్యత మనపైనే వున్నది.

దేశోద్ధారకునికి ప్రత్యేక స్మారక చిహ్నాలను ఏర్పాటు చేయవలసిన అగత్యం లేదు. ఏ ఉన్నతాశయాల కోసం వారు జీవించారో, వాటిని యథాశక్తి కొంతవరకైనా ఆచరణలో పెట్టడానికి సోదరాంధ్రులు త్రికరణశుద్ధిగా ప్రయత్నిస్తే, ఆ ప్రయత్న ఫలితమే దేశోద్ధారకునికి ఉత్తమ స్మారక చిహ్నమవుతుంది. నేడు జరిగే వర్ధంతి సభలలో మనం ఇందుకు కంకణధారులం కావాలి. ఇదే నేడు వారి ఆత్మకు మనం సమర్పించగలిగిన దివ్యాంజలి.

# దివ్యస్మృతి
# దేశోద్ధారక వర్ధంతి

"శాస్త్రి"

ఒకొక్క సంస్మృతి మన హృదయంలో నిరంతరమైన అగరుధూమ మాలికలా పరిమళాలు విరజిమ్ముతూ వుంటుంది.

ఒకొక్క దివ్య సంస్మృతి ఒకొక్క వ్యక్తికేగాక దేశానికంతటికీ నిరంతర పరిమళభరితమైన నిత్య నీరాజనంలా నిలిచిపోతుంది! కళాప్రపూర్ణ, దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరాయని సంస్మరణ ఈ కోవకు చెందిన ఒక మహా దివ్య సంస్మృతి.

రేపు అక్టోబరునాటికి సువిశాలమైన ఆంధ్ర ప్రదేశావతరణం జరగబోతున్నది. ఇది అనుసాతనమైన ఆంధ్రజాతిచరిత్రలో చిరస్మరణీయమైన ప్రముఖ దివసంగా నిలిచిపోగలదు.

చిరకాలంనించీ ఈ శుభతరుణం కోసం సర్వతోముఖంగా కాయకష్టలా కృషి చేసిన మహనీయులెందరో ఉన్నారు. వారందరిలోను అగ్రగణ్యుడై యశశ్శరీరంతో ఆంధ్రజాతి కళ్ల ఎదుట నిలిచిన మహావ్యక్తి కాశీనాధుని దేశోద్ధారకుడు. ఈవేళ చైత్ర శుద్ధ ద్వాదశినాడా మహామహుని వర్ధంతి అవేసరికి మన హృదయాలలో ఎన్నెన్నో మనోజ్ఞభావపరంపరలుదయిస్తున్నాయి.

సాంఘిక రాజకీయోద్యమాలలో ముమ్ముందుకు ఉరికి దేశోద్ధరణకు సర్వస్వం త్యాగంచేసినమహనీయులెందరో ఉండవచ్చును.

అయితే వారిలో చాలామందికి సారస్వతము, కళలు, సంస్కృతి మొదలైనవి పట్టవే పట్టవు. అలాగే సారస్వతాది కృషులలో సర్వస్వం త్యాగం చేసిన వారెందరెందరో ఉండవచ్చును. వారికి మిగిలిన సాంఘిక రాజకీయోద్యమాలలో కృషిచెయ్యడానికి తగిన అభినివేశంగాని, శక్తి సామర్థ్యాలుగాని, అవకాశాలుగాని ఉండడం గగన కుసుమం. ఒకవేళ సాంఘిక రాజకీయ సారస్వతాది రంగాలలో అభిరుచి, అభినివేశము ఉన్నా వాటికి తగిన ప్రతిభగాని, సమగ్రమైన జాతిసర్వతోముఖాభివృద్ధికి కృషిచెయ్యడానికి తగిన ప్రాభవైశ్వర్యాలుగాని, ఔదార్యంగాని కలిగినవారు చాలా అరుదుగా ఉంటారు. ఇవి అన్నీ మూర్తీభవించిన మహావ్యక్తి కళాప్రపూర్ణ కాశీనాధుని నాగేశ్వరరావు పంతులు.

సర్వతోముఖమైన పత్రికా రచనకు, సాహిత్యోద్ధరణకు ఆయన చేసిన కృషి నేటి ఆంధ్రజాతి కొక అపారవిజ్ఞాన ఖనిలా నిలిచింది. కొన్ని సారస్వత రంగాలలో ఆయన చేసిన పునాదులింకా అసంపూర్ణంగానే ఉండిపోయాయి.

ఆంధ్రోద్యమంలో అహోరాత్రాలుగా శ్రమించిన ఆయన కృషి సువిశాలాంధ్రరాష్ట్రంగా రూపొందబోతున్నదంటే అది కైలాసవాసులైన వారి ఆత్మకు కొంతవరకు ఆనందదాయకం కావచ్చును. అయితే మిగిలిన సారస్వత వైజ్ఞానికాదిరంగాలలో దేశోద్ధారకుడు ప్రారంభించిన ఉద్యమాలు సఫలం చెయ్యవలసిన విధినిర్వహణ ఇంకా యావదాంధ్రజాతి పైనా నిలబడే ఉన్నది.

రాజకీయరంగంలో వారి సౌశీల్య సంప్రదాయం నేటి ఆంధ్రనాయకులనుదినము సంస్మరించుకోవలసిన అవసరం ఎంతైనా ఉన్నది. ఆ సంప్రదాయ సంరక్షణపైనే ఆంధ్రజాతి భవిష్యత్తంతా ఆధారపడిఉన్నది.

సర్వతోముఖమైన కాశీనాధుని వ్యక్తి పరిపూర్ణతకు వెలుగుఇచ్చినది అకలంకమైన ఆధ్యాత్మికదృష్టి. ఆ దృష్టితోనే ఆయనకు సహజమైన అనాసక్తి భావము, ఔదార్యము అలవడ్డాయి.

వివిధ ప్రజోద్యమాలలో అవిరళంగా కృషి సాగిస్తున్న నేటి నాయకులలో నాగేశ్వరరాయనితో సరిపోల్చదగిన పరిపూర్ణ పురుషులు కానరారు.

కనకనే మహత్తరమైన ఆ వ్యక్తి సంస్కృతి నేడు మనకొక ధ్రువతారలా భాసిస్తున్నది.

ఈ పునీత సంస్మృతి ఆంధ్రజాతి నిరంతరాభ్యుదయ పరంపరాభివృద్ధికొక వెలుగుబాట నిర్దేశింపగలదనీ, తెలుగునాట తిరిగి వారి సంస్మృతి నూతన చైతన్యం రేకెత్తించగలదనీ ఆశిస్తున్నాను.

ఆంధ్రజాతి ఆ మహాపురుషుని సంస్మరించి తిరిగి సముజ్జ్వలమైన నూతన సువిశాలాంధ్ర మార్గంలో పయనించ గలదనీ ఆ యాత్రలో ఆంధ్రులకు కాశీనాధుని దివ్యాదర్శ శీస్సులు పుష్పాంజలిరూపంలో వర్షించగలవనీ ఆశిస్తున్నాను.

# గిరిజనాభివృద్ధికి సహాయ సంస్థ
## విశాఖపట్నంలో స్థాపన

విశాఖపట్నం, ఏప్రిల్ 18: ఆంధ్ర షెడ్యూల్డు జాతుల (గిరిజన) అభివృద్ధి సహాయ సంస్థ నిన్న ఇక్కడ ఏర్పాటయింది. రాష్ట్రంలో 5 లక్షలమంది వరకూ ఉన్న గిరిజనులకు ఈ సంస్థ అప్పుల సదుపాయం చేస్తుంది. గవర్నరు శ్రీ త్రివేది దీనికి నిన్న ప్రారంభోత్సవం చేశారు.

ఈ సందర్భంలో సాంఘిక సంక్షేమశాఖమంత్రి శ్రీ లచ్చన్న ప్రసంగిస్తూ ఈ సంస్థకు గిడ్డంగులు కట్టేందుకూ, రవాణా ఖర్చులకూ కేంద్రమూ నాలుగు లక్షల రూపాయల గ్రాంటును కేంద్రప్రభుత్వం ఇస్తుందని వెల్లడించారు.

దీని పెట్టుబడి కోసం ద్వితీయ ప్రణాళికలో పదిలక్షలు ఏర్పాటయిందనీ, మరిరెండు లక్షలు గ్రాంటుగా ఇవ్వవలసిందని ఆంధ్రప్రభుత్వం కేంద్రాన్ని కోరిందనీ ఆయన తెలియజేశారు.

గిరిజనసంక్షేమశాఖ డైరెక్టరు శ్రీ హెచ్. సాంబమూర్తి, కేంద్ర ఆర్థిక మంత్రి శ్రీ సి. డి. దేశముఖ్, దేశీయ వ్యవహారాలశాఖ ఉపమంత్రి దాతార్, శ్రీ తెన్నేటి విశ్వనాథం ప్రభృతులు పంపిన సందేశాలు చదివారు.

శ్రీ త్రివేది ప్రారంభోత్సవంచేస్తూ, రాష్ట్రంలో, కొండజాతుల స్థితిగతుల అభివృద్ధికి, తలపెట్టిన చర్యలలో యీ సంస్థ యేర్పాటు ఒకటి అని చెప్పారు. శ్రీ త్రివేది యింకా యిలా చెప్పారు. ఆంధ్రరాష్ట్రం విస్తీర్ణం 63 వేలచదరపుమైళ్లు. ఇందులో, గిరిజనులు నివసించే ప్రాంతాల విస్తీర్ణం 6500 చదరపు మైళ్లున్నది. ఆంధ్రదేశం మొత్తం జనాభా 2 కోట్లు; అందులో గిరిజనులు 5 లక్షలున్నారు. ఆంధ్ర జనమే బీదజనము. ఇక గిరిజనులంటే ఏజెన్సీప్రాంతం విషయం చెప్పనవసరంలేదు. గిరిజనులు బీదవాళ్లు మాత్రమే కాదు, అమాయకులుకూడా. ఏజెన్సీప్రాంతంలో, తాము తయారుచేసిన వస్తువులు అమ్ముకోవాలన్నా, యితరప్రాంతాలనుండి, తమకు కావలసిన నిత్యావసర వస్తువులు తెప్పించుకోవాలన్నా వాళ్లు, ఏకాకిలమీద ఆధారపడుతూ వస్తున్నది. అప్పులిచ్చేవాళ్లు, గిరిజనులకు సహాయపడుతునే ఉన్నారు. కాని అప్పులమీద, గిరిజనులు విపరీతమైన వడ్డీ చెల్లించుకుంటూనే ఉన్నారు.

నూటికి రు 50 లు, రు 75 లు వడ్డీ తీసుకొంటున్నారు. ఇంత వడ్డీతో అప్పులిచ్చి, గిరిజనులు తినువస్తువు లేక్కే సరకులను చౌకబారుగా కొని, వాటిని, ఎక్కువ ధరలకు, బజార్లలో అమ్ముకొని బాగుపడుతున్నారు. ఇది 100 సంవత్సరాలుగా జరుగుతోంది. ఇప్పుడు, గిరిజనప్రాంతాలలో, సహకార సహకార సంఘాలు పనిచేస్తున్నవి. కాని ఇవి చాలా చిన్నవి. ఇవి చేసే పనికూడా బహుతక్కువ. గిరిజన ప్రాంతాలలో ప్రజల స్థితిగతులు బాగు చేయాలంటే, ముఖ్యంగా మూడు సమస్యలు ఎదుర్కోవాలి. అవి, గిరిజనులకు పరపతి కల్పించడం, వాళ్ళకు కావలసిన సరకులు సరఫరాచేయడం, వాళ్లు తయారుచేసే సరకులు సరియైన ధరలకు అమ్మించి పెట్టడం. ఈ మూడు సమస్యలను ఆర్థిక సహాయసంస్థ జయప్రదంగా పరిష్కరించాలి. ఈసంస్థ జయప్రదంగా నిర్వహించడం వీరుంత శేలికపని గాదు. గిరిజనులకు కావలసిన డబ్బు పెట్టుబడి యీ సంస్థ సమకూర్చాలి.

తరువాత సంఘ సంక్షేమశాఖ మంత్రి శ్రీ గౌతు లచ్చన్న శ్రీ త్రివేదికి కృతజ్ఞత తెలుపుతూ, గిరిజన ఆర్థిక సహాయసంస్థ పుట్టుపూర్వోత్తరాలు సవిస్తరంగా చెప్పారు.

దళారుల బాధనుండి, గిరిజనులను కాపాడడానికి, వాళ్ల జీవితాన్ని బాగుచేయడానికి యిది యేర్పాటు అయింది. దీనికి ప్రభుత్వం 8 లక్షలు గ్రాంటుగా మంజూరుచేసింది. యీ డబ్బుతో, మన్యప్రాంతాలలో, రవాణాసౌకర్యాలకు రస్తాలు, మన్యపు సరకులు నిల్వచేసేందుకు గిడ్డంగులు నిర్మించవలసి ఉందని శ్రీ లచ్చన్న తెలియజేశారు. సంస్థ ప్రారంభ పెట్టుబడిక్రింద, 2 లక్షలు యివ్వమని కేంద్రప్రభుత్వాన్ని అడిగామని, యింకా సమాధానంరాలేదని, అయితే, యీలోగా రాష్ట్రప్రభుత్వం డబ్బుమండి ఆ మొత్తం యిచ్చారుని చెప్పారు. ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో, యీ సంస్థకు అదనపు పెట్టుబడిక్రింద 10 లక్షలు కేటాయించామని తెలియజేశారు. ప్రస్తుతానికి, విశాఖ శ్రీకాకుళం జిల్లా మన్యపు ప్రాంతాలకే యీ సంస్థ సహాయపడుతుందని, క్రమేణా యీ సహాయం మిగతా మన్యాలకు కూడా విస్తరింప చేయవలసి ఉందని అన్నారు.

## కలకత్తా రేవులో అవాంతర పరిస్థితి
### ఏర్పడినట్లు ప్రకటన

కలకత్తా, ఏప్రిల్ 19: కలకత్తా రేవులో అవాంతరపరిస్థితి ఏర్పడినట్లు రేవు నిర్వహణ సంఘాధ్యక్షుడు శ్రీ ఆర్. కె. మైత్రా నేడు ప్రకటించారు. రేవులో పనికి తీవ్ర ఆటంకాలు కలగటంవల్ల ఈ చర్యతీసుకోవలసివచ్చిందని ఆయన వివరించారు. ఇది మూడు నెలలపాటు అమలులో ఉంటుంది.

రేవు కూలీలు 8వేలమంది సమ్మె ప్రారంభించి ఈవేళ అయిదో రోజు. ఈ సమ్మెవల్ల నిలిచి పోయిన ఓడల సంఖ్య ఈవేళ 65కి పెరిగింది. 35 వేల టన్నుల సరుకును దించటం, 75 వేల టన్నుల సరుకును ఎక్కించటం ఆగిపోయింది.

అవాంతర పరిస్థితిని ప్రకటించటంవల్ల పరిస్థితి బాగుపడవచ్చునని మూడు కార్మిక సంఘాల్లోనూ రెండింటిలో నాయకులు అభిప్రాయం వెల్లడించారని శ్రీ మైత్రా తెలియజేశారు.

మామూలుగా ప్రతినెలా 15వ తారీకున ఇచ్చే మధ్యంతర జీతాలను కొన్ని ఇబ్బందులవల్ల ఆ మర్నాడు ఇవ్వటానికి నిర్ణయం జరిగిందనీ, ఈ స్వల్ప కారణానికి సమ్మె జరగవలసిన పని లేదనీ, కూలీలు తిరిగీ పనిలో ప్రవేశించాలని ఆయన అన్నారు.

## ఫ్రెంచి పరాక్రమం
### 15 వేల అల్జీరియన్లతో 2 లక్షలమంది పోరాటం

పారిస్, ఏప్రిల్ 19: అల్జీరియా తిరుగుబాటు దారులతో పోరాటం సాగించే నిమిత్తం ఒక నెలరోజుల్లో ఫ్రెంచి బలాలను లక్షకు పెంచాలని నిర్ణయం జరిగినట్లు ఫ్రెంచి రక్షణమంత్రి యమ్. యమ్. యారీస్ బోర్జెస్ మానోరీ తెలియజేశారు.

ప్రస్తుతం అల్జీరియాలో 15 వేల తిరుగుబాటు దారులతో 2 లక్షలపైచిలుకు ఫ్రెంచి సైన్యం పోరాడుతున్నారు.

## లిస్బన్‌లో సురావర్దికి విందులు

కరాచీ, ఏప్రిల్ 19: పాకిస్తాన్ ప్రతిపక్ష నాయకుడు శ్రీ సురావర్ది పోర్చుగల్ రాజధానిలిస్బన్‌లో ఏప్రిల్ 16 న పోర్చుగల్ విదేశాంగ మంత్రి శ్రీ పాల్ కూనాను కలుసుకొని తమ రెండు దేశాలకు సంబంధించిన అనేక సమస్యలను చర్చించారు. ఈ విషయాన్ని పాకిస్తాన్ రేడియో నేడు ప్రకటించింది.

ఈ రేడియో చెబుతున్న వార్తల ప్రకారం ఏప్రిల్ 17 వ తేదీ నాడు శ్రీ సురావర్దికి శ్రీ కూనా విందుచేశారు. విందుకు మాడ్రిడ్‌లోని పాకిస్తాన్ రాయబారి కూడా హాజరైనారు.

బెంగుళూరు, ఏప్రిల్ 19: మైసూరు చీఫ్ ఎలక్ట్రికల్ యింజనీర్ శ్రీ జార్జి చాండీ గత రాత్రి కారు నడుపుతూ గుండె ఆగిపోవటంవల్ల మరణించారు. తరవాత కారుపోయి ఒక స్తంభానికి గుద్దుకున్నది.

# బ్రిటన్ రష్యాల మధ్య వైషమ్యాల నివారణ
## లండన్‌లో ప్రధానుల చర్చలు

లండన్, ఏప్రిల్ 19: బ్రిటన్ రష్యాల మధ్య వైషమ్యాలను నివృత్తిచేయాలనే లక్ష్యంతో, సోవియట్ యూనియన్ ప్రధానమంత్రి శ్రీ నికొలాయ్ బుల్గానిన్, సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు ప్రధానకార్యదర్శి శ్రీ నికితా క్రుశ్చేవ్ ఇవాళ మధ్యాహ్నం బ్రిటిష్ ప్రధానమంత్రి సర్ ఆంథోనీ ఈడెన్‌తో సమాలోచనలు ప్రారంభించారు.

రెండో ప్రపంచ యుద్ధకాలంలో ఆర్థిక సహకారం కొనసాగినప్పటి నుంచి, ఈనాటివరకూ ఈ రెండు దేశాలమధ్య నడిచిన వ్యవహార విధానాన్ని ముందుగా సమీక్ష చేశారు.

ఈ సమాలోచనల సమాచారాన్ని రహస్యంగా వే ఉంచాలనీ సినినిగురించి ఉభయ పక్షాలూ సమ్మతితో సంయుక్త ప్రకటనలు చెయ్యాలేకాని ఇతరత్రా ఏ అంశాలనూ బయటపెట్టరాదనీ మొట్టమొదట ఏకాభిప్రాయం కుదిరినట్లు సమావేశానంతరం అధికార ప్రకటనలు వెలువడింది.

పది రోజుల బ్రిటన్ పర్యటనకు బ్రిటిష్ ప్రభుత్వంలో రాజకీయ సమాలోచనలకు ఇక్కడికి నిన్న మధ్యాహ్నం వచ్చిన సోవియట్ నాయకులు ఇవాళ ఉదయం లండన్‌నగరం చుట్టి వచ్చారు. మధ్యాహ్నం బ్రిటిష్ ప్రధాని తో చర్చలు ప్రారంభించారు. ఈ చర్చలు అతి దీర్ఘంగా ఉండగలవని ఇక్కడ భావిస్తున్నారు.

ఇవాళ మధ్యాహ్నం సమాలోచనలు బ్రిటిష ప్రధాని అధికార వసతిగృహం డౌనింగ్ వీధిలో జరిగాయి. ఈ చర్చలలో నిర్దిష్ట కార్యక్రమం ఏదీలేదనీ, ఏ ఒక్క సమస్యనీ పరిష్కరించాలనే ఉద్దేశంతో ఇవాళ చర్చలు జరగలేదనీ అధికార ప్రకటన వివరించింది. రేపు ఏయే అంశాలను చర్చించాలో మాత్రమే ప్రకటిస్తారు.

రాజకీయ సమాలోచనలకు నిన్న రాత్రి సోవియట్ రాయబార కార్యాలయంలో జరిగిన విందులోనే నాంది జరిగింది.

చేసుకోవాలనే వాంఛను ఇదివరకే శ్రీ బుల్గానిన్, శ్రీ క్రుశ్చేవ్ స్పష్టంగా ప్రకటించారు. రష్యా అసలు లక్ష్యాల పట్ల అనుమానాలు మరిచిపోకుండానే, అనుమానిస్తూకూడా రెండు దేశాల మధ్య వ్యవహారాల నెంతవరకూ బాగుపరచవచ్చునో అనే ఉద్దేశంతో బ్రిటిష్ ప్రధాని, ఇతర మంత్రులు ఈ సమాలోచనలు సాగిస్తున్నారు.

ఇవాళ ఉదయం సోవియట్ నాయకులు శ్రీ బుల్గానిన్, శ్రీ క్రుశ్చేవ్ యుద్ధ స్మారక సమాధిని దర్శించి అక్కడ పూలమాలలు సమర్పించారు. లండన్‌లో బ్రిటిష్ రాణి నివసించే బకింగ్‌హామ్ రాజభవనాన్ని చూశారు. రాజభవనంలోని ఉద్యానవనాల్ని చూశారు. అక్కడ 40 నిముషాలు బ్రిటిష్ ప్రధాని, విదేశాంగమంత్రులతో రాజకీయాలు ముచ్చటించారు.

నిన్న బ్రిటన్‌లో అడుగుపెట్టినది మొదలు రష్యన్ నాయకుల చుట్టూ బ్రిటిష్ పోలీసులు విస్తారంగా పోలీసు బందోబస్తు పెట్టారు. వారెక్కడికి వెళ్ళినా అనుకూలం బందోబస్తు వారిని చుట్టుముట్టే ఉంటోంది.

రష్యన్ నాయకులు నగరవీధుల్లో నడుస్తున్నప్పుడు ప్రజలు ఎక్కడా పెద్ద గుంపులుగా చేరలేదు. ఎవరూ హర్షధ్వానాలూ చెయ్యలేదు. నిన్న ఒకచోట జరిగినట్లు, ఎవరూ నిరసనా ప్రకటించలేదు. "ఎర్ర బందిపోట్లు రానివ్వకండి" అని నిన్న కేకలు పెట్టినందుకు ముద్దాయి ఇవాళ న్యాయస్థానంలో విచారించి జరిమానాలు విధించారు.

బ్రిటన్‌లో వైషమ్యాలను నివృత్తిచేయాలని...

# ప్రణాళికకు ప్రపంచ బ్యాంకు సహాయం
## అవకాశాల పరిశీలనకు ప్రతినిధివర్గం రాక

న్యూఢిల్లీ, ఏప్రిల్ 19: భారతదేశపు ద్వితీయ పంచవర్ష ప్రణాళికకు తాను అప్పులిచ్చేందుకు గల అవకాశాలను పరిశీలించే నిమిత్తం ప్రపంచబ్యాంకు పంపిన నలుగురు ప్రతినిధులు నేడు వాషింగ్టన్‌నుంచి ఇక్కడకు వచ్చారు. ప్రతినిధి వర్గనాయకుడు శ్రీ థామస్ మెక్‌ట్రిక్ మాత్రం మే 2 వ తేదీన వస్తారు. మరొకసభ్యుడు తరవాత వస్తారు.

ప్రతినిధివర్గం ఉపనాయకుడు శ్రీ. సి. డీమెల్ తామిక్కడ ఏడెనిమిది వారాలు పర్యటిస్తామనీ, కలకత్తా, బొంబాయి, మద్రాసు, బెంగుళూరు వంటి పారిశ్రామిక కేంద్రాలను చూస్తామనీ, తరవాత ఇతర ప్రాంతాలకుకూడా వెళ్లవచ్చుననీ తెలియజేశారు. ఈ ప్రతినిధివర్గం త్వరలోనే ప్లానింగ్ కమిషన్‌తోనూ, ఆర్థికశాఖ ఉన్నతాధికారులతోనూ సంప్రదింపులు జరుపుతుంది.

"మేమిక్కడకు వచ్చింది ప్రపంచబ్యాంకు సహాయంచేసే ప్రాజక్టులనే చూసేందుకుకాదు. భారతదేశ ఆర్థికాభివృద్ధి ఎట్లా సాగుతున్నదీ, ఆర్థికాభివృద్ధికి గల అవకాశాలను పరిశీలించేందుకూ, బ్యాంకు సహాయానికి దీర్ఘకాల విధానాన్ని రూపొందించేందుకు అవసరమయిన అంశాలను పరిశీలించేందుకు కూడా ప్రపంచబ్యాంకు ఈ దేశంలో ఫలానా ప్రాజక్టులకు సహాయం చేయాలనే నిర్దేశించటం ఉండదు. ప్రత్యేక ప్రాజక్టులకు సహాయంచేసే విషయమై టాటా ఉక్కు ఫాక్టరీ మొదలైన సంస్థలతో విడిగా సంప్రదింపులూ జరుగుతున్నవి." అని శ్రీ డీమెల్ వివరించారు.

తనకు ఎంత సహాయం కావాలో భారతదేశం సూచించిందా అని అడగ్గా అట్లా నిర్దేశించి అడగటం జరగలేదని ఆయన తెలియజేశారు. భారతదేశం గరిష్ఠాభివృద్ధిని సాధించటమే తమ సంకల్పమని ఆయన అన్నారు. ఆ అభివృద్ధికి దోహదం చేయగలనని తాను అనుకునే విధానాలను తాము అభిమానించటం సహజమని అన్నారు. అయితే ఈ విషయంలో తుది నిర్ణయం భారత ప్రభుత్వానిదేనని అన్నారు.

ద్వితీయ ప్రణాళికను చూశారా అని అడగ్గా, ప్రణాళికమీది నివేదికను చూశాననీ, 800 కోట్ల రూపాయల లోటు ఉన్నట్లు గమనించాననీ శ్రీ డీమెల్ తెలియజేశారు.

భారత దేశ ఆర్థిక వ్యవస్థలో జన స్వామిక రంగ విస్తరణను గురించి అడగ్గా, తమకు దేశ ఆర్థిక వ్యవస్థను గురించే కాని రాజకీయాలతో ఆసక్తి లేదనీ ఆర్థిక విధానాల మార్పుకు కారణమయిన రాజకీయ భావాలను కొన్నిటిని గమనించటం మాత్రం చేస్తామనీ అన్నారు.

## బాగ్దాద్‌కూటంలో కాశ్మీర్ ప్రసక్తి

1 వ పేజీ 3 వ కాలం తరువాయి

ఉండాలని బ్రిటిష్ ప్రతినిధి ఒకరు భారత పత్రికా విలేఖరితో సంభాషిస్తూ చెప్పుకున్నారు. కాశ్మీరు సమస్య పరిష్కారం కావలసిన అవసరం ఉన్నదన్నారే కాని సమస్యలోని మంచి చెడ్డలను గురించి ఎలాంటి అభిప్రాయం ప్రకటించలేదని సాను చెప్పారు. అదీ కాక పాలస్తీనాకూడా చర్చించినందువల్ల కాశ్మీరుచర్చించకతప్పలేదన్నారు.

కాశ్మీరుగురించి ప్రకటనలో ఉన్న మాటలు ఎంత నిరాపదమైనా, ప్రకటిస్తున్నది సైనికకూటం కాబట్టే అసహ్యకరంగానే ఉంటాయని భారతీయుల అభిప్రాయం.

కాశ్మీరు సమస్యపై కూటంలో చాలా దీర్ఘచర్చ జరిగింది. మధ్యాహ్నం అంతా ఈ విషయమే చర్చించారు. ప్రకటనలో ఈ ప్రసక్తి తేవడానికి బ్రిటన్ వెనుకాడిందనీ పాకిస్తాన్ గట్టిపట్టు పట్టిందనీ తెలుస్తోంది. ఇది చేరిస్తే ఇజ్రాయల్ ప్రసక్తి తేవాలని ఇరాన్ పట్టుపట్టిందట. టర్కీ పాకిస్తాన్ బలపరిచి రెండు సమస్యల ప్రసక్తి ఉండాలని సూచించిందట. ఇరాన్ ఏ పక్షాన్నీ సమర్థించలేదు.

భద్రతామండలిలో సభ్యత్వం కల ఇరాన్ కాశ్మీరు విషయంలో తమవాదాన్ని సమర్థించాలని పాకిస్తాన్ అర్థించిందని తెలుస్తోంది. ఈ సందర్భంలో పాకిస్తాన్ ప్రధాని ఇరాన్ ప్రధానిని స్వయంగా కలుసుకుని మాట్లాడారు, ఇతరదేశాల ప్రతినిధులను కూడా పాక్ ప్రధాని యీ సందర్భంలో కలుసుకుంటున్నారు.

పొద్దుటి సమావేశం ముగియగానే ప్రకటించవలసిన సంయుక్త ప్రకటన కాశ్మీర్ను కూడా ప్రకటనలో చేర్చాలని పాకిస్తాన్ పట్టు పట్టినందువల్ల సాయంకాలంవరకూ జాప్యమయిందని తెలుస్తోంది. ఈ సమస్యపై మధ్యాహ్నం అంతా చర్చజరిగిందట. మధ్యాహ్నం చర్చలో కొద్దిగా అల్జీరియా ప్రసక్తికూడా వచ్చిందట. ఈ సమావేశానికి పైవారి నెవ్వరినీ రానివ్వలేదు.

### సైనికకూటాల అగత్యం

సమావేశం అనంతరం బాగ్దాద్ కూటం చేసిన దీర్ఘ ప్రకటనలో ఒక విధంగా సైనికకూటాల అగత్యాన్ని సమర్థించడం జరిగింది. సైనికకూటాన్ని మరింత బలపరచాలంటూ, కమ్యూనిస్టుల తంత్రాంగం మారినా, అసలు లక్ష్యాలు మారలేదని వివరించింది. అందువల్ల ఈ కూటం "దేశరక్షణశక్తి" పెంచుకోవాలని సైనిక సంఘం తీర్మానించింది.

కూటం కార్యకలాపాల్లో అమెరికా పాల్గొనడానికి అంగీకరించినందుకు కూటం హర్షం ప్రకటించింది. శాంతి లక్ష్యాలను సాధించడానికీ, కూట రాజ్యాల సైనికబలం పెంపొందడానికీ అమెరికాసహాయం అవసరం అని ప్రకటన వివరీకరించింది.

పశ్చిమాసియా ప్రాంతంలో విద్రోహచర్యల ప్రమాదం ఉందని కూటం అభిప్రాయపడింది. ఈ కుట్రల్ని నిరోధించడం కోసం కుట్ర నిరోధకసంఘం ఒకటి స్థాపించారు. ఈ కుట్ర ప్రమాదాలు అసలు సంభవించకుండా చేయాలంటే, ఆర్థికంగా బాగా హీనస్థితిలో ఉన్న, ఈ ప్రాంతంలో ఆర్థికాభివృద్ధికి విశేష కృషి అవసరం అని గుర్తించారు. ఈ కూటానికి శాశ్వత కార్యస్థానం స్థాపించాలని నిర్ణయించారు.

### అమెరికా తోడ్పాటు

పశ్చిమాసియాలో కుట్రల్ని నిరోధించడంకోసం ఏర్పడిన సంఘంలో అమెరికా పూర్తి సభ్యత్వం స్వీకరించిందని ఈ కూటం సమావేశానికి వచ్చిన ప్రధాన అమెరికన్ పరిశీలకుడు శ్రీ లాయ్ హెండర్సన్ ప్రకటించారు. అంతేగాక, కూటం స్థాపించే కార్యస్థానం ఉండే నగరంలోనే బాగ్దాద్ సైనిక సహకార సంస్థ అంటూ అమెరికన్ సైనికసంస్థను స్థాపించాలని అమెరికా నిర్ణయించింది. ఈ సంస్థకు ఒక అమెరికన్ సైనికాధిపతిని నియమిస్తారు.

బాగ్దాద్ సైనికకూటం కార్యకలాపాలన్నిటిలోనూ అమెరికా సహకరిస్తుందని శ్రీ హెండర్సన్ తెలియజేశారు.

[అమెరికా ఈ కూటంలో ప్రత్యక్ష సభ్యత్వం తీసుకోలేదు.]

సైనిక, ఆర్థిక సహాయ సహకారాలివ్వడానికి అమెరికా ఈ కూటానికి చెందిన దేశాలన్నిటితోనూ విడివిడిగా ఒడంబడికలు చేసుకుంటుందని తెలియపరిచారు. బాగ్దాద్ కూటానికి గొప్ప కార్యాలు నిర్వహించగల సమర్థత ఉన్నదనీ, తప్పక ఈ ప్రాంతంలో శాంతి సాధించ గలుగుతుందనీ అమెరికాకు నమ్మకం పటిష్ఠమైనదన్నారు.

## కాంబోడియాపై దిగ్బంధనాలు
### తమకు సంబంధంలేదని డలెస్ లేఖ

వాషింగ్టన్, ఏప్రిలు 19: కాంబోడియాను మనిలాకూటమిలో చేరవలసిందిగా అమెరికా బలవంతం చేస్తున్నదన్న ప్రచారాన్ని ఖండిస్తూ విదేశాంగమంత్రి శ్రీ డలెస్ కాంబోడియా విదేశాంగమంత్రికి ఒక ఉత్తరం వ్రాశారు.

దక్షిణవియత్‌నాం, థాయిలాండులను రెచ్చగొట్టి, ఆర్థికాది దిగ్బంధనాలను అమెరికా ప్రయోగిస్తున్నదనే ప్రచారాలనుకూడా శ్రీ డలెస్ ఖండించారు.

"ఇలాటి ఆరోపణలమూలంగా మన రెండుదేశాలమధ్య సహవాసం చెడిపోతుంది" అని శ్రీ డలెస్ వ్రాశారు.

దక్షిణ వియత్‌నాంలో అమెరికా మద్దతుతో అధికారంలోకివచ్చి డీమ్ ప్రభుత్వం కాంబోడియాపై దాడులు సాగించినట్లు వార్తలు వచ్చాయి. థాయిలాండు కాంబోడియామీద ఆర్థిక దిగ్బంధనాన్ని ప్రయోగిస్తున్నది

ఈస్థితిలో శ్రీ డలెస్ పైఉత్తరం వ్రాశారు.

## మొరాకో సైన్యానికి హంగులు
### ఫ్రాన్సుతో ఒప్పందం

కాసబ్లాంకా, ఏప్రిల్ 19: మొరాకోజాతీయ సైన్యంలోని మొదటి 15 వేలమందికి మే 12 నాటికి ఆయుధాలు లభిస్తాయని సుల్తాన్ బెన్ యూసఫ్ ఆశిస్తున్నట్లు ఆయన కుమారుడు మౌలే హస్సన్ తెలియజేశారు.

మొరాకో అన్ని హంగులతో సైన్యాన్ని ఏర్పాటు చేసుకోవటంలో సహాయం చేయటానికి ఫ్రాన్సు అంగీకరించింది. మొరాకో స్వాతంత్ర్యాన్ని గుర్తించే సందర్భంలో యీ ఒప్పందం జరిగింది.

## భద్రాచలంలో 114 డిగ్రీలు
### శ్రీరామనవమి ఉత్సవాలు

భద్రాచలం, ఏప్రిలు 19: శ్రీరాములవారి కల్యాణోత్సవాలకు వచ్చిన ప్రజలు 114 డిగ్రీల ఎండ వేడిమి భరించవలసి వచ్చింది.

నలుగురికి వడదెబ్బ తగిలింది. వారిని ఆసుపత్రిలో చేర్చారు. అందులో ఒకరు చనిపోయారు.

గోదావరిలో స్నానం చేస్తూ గుంటూరు యువకుడొకడు మునిగిపోవడం ఇక్కడ జరిగిన మరొక దురదృష్టసంఘటన.

శ్రీ సీతారాము కల్యాణానికి వేలాది ప్రజలు వచ్చారు. హైదరాబాదు నుంచి శ్రీ మాడపాటి హనుమంతరావు, శ్రీ కొండా వెంకటరంగారెడ్డి, శ్రీ పల్లెర్ల హనుమంతరావు వచ్చారు. భారత ప్రభుత్వపు చలనచిత్ర శాఖ కల్యాణోత్సవాన్ని చిత్రింగా తీశారు.

పారిశుద్ధ్యపు ఏర్పాట్లు బందోబస్తు చాలా చక్కగా జరిగాయి. ఇది హైదరాబాదురాష్ట్ర అధ్వర్యంక్రింద జరిగే ఆఖరు కల్యాణోత్సవం.

ఆరోగ్యశాఖ అసిస్టెంటు డైరెక్టరు శ్రీ జి. యస్. యశ్, నాయుడు, ఖమ్మం కలెక్టరు శ్రీ జె. వి. భట్, పోలీసు సూపరింటెండెంటు శ్రీ శ్రీనివాసన్, డిప్యూటీ సూపరింటెండెంటు శ్రీ ఐ. సుబ్బారావు స్వయంగా ఏర్పాట్లను, పరిస్థితిని గమనిస్తూ పనిచేశారు.

(స్వ. వి.)

## పశ్చిమ పాక్ మంత్రివర్గం
### మరో ముగ్గురిని తీసుకునే యత్నం

లాహోరు, ఏప్రిల్ 16: పశ్చిమ పాకిస్తాన్ మంత్రివర్గంలో మరి ముగ్గురు మంత్రులనైనా అదనంగా నియమించాలని ముఖ్యమంత్రి డా॥ ఖాన్‌సాహెబ్ నిశ్చయించినట్లు తెలుస్తున్నది. ప్రస్తుతం మంత్రివర్గంలో 8 మంది మాత్రమే వున్నారు.

కొత్త మంత్రులు పూర్వం సింధు, సరిహద్దు రాష్ట్రాలుగా ఉన్న ప్రాంతాల వారని కూడా తెలుస్తున్నది. కొంత కాలం అయిన తర్వాత పంజాబు నుంచి ఒక ఇద్దరిని, బెలూచీస్తాన్‌నుంచి ఒకరిని డా॥ ఖాన్‌సాహెబ్ ఇందులో చేర్చుకుంటారు.

మాలిక్ ఫిరోజ్ ఖాన్‌నూన్ ఈ మంత్రివర్గంలో చేరవచ్చునని కొన్ని వార్తలు వినిపిస్తున్నాయి.

ముస్లిం లీగు వారు ధూమాలుగా డా॥ ఖాన్‌సాహెబ్ మంత్రివర్గాన్ని విమర్శిస్తూనే వున్నారు. ఈయన హయాంలో స్వతంత్రమైన ఎన్నికలు జరగడం అసాధ్యం అంటూ ముస్లిం లీగు నాయకుడు సర్దార్ బహదూర్ ఖాన్ నేడొక ప్రకటన చేశాడు.

## కోలారు గనుల జాతీయం సమస్య
### ఢిల్లీ సంప్రదింపులు ముగింపు

న్యూఢిల్లీ, ఏప్రిల్ 19: కోలారు బంగారు గనులను మైసూరు ప్రభుత్వం జాతీయం చేసే విషయమై రాష్ట్రప్రభుత్వానికీ, కేంద్ర ప్రభుత్వానికీ ఇక్కడ జరుగుతున్న సంప్రదింపులు ముగిసినవి. ఇంక గనుల అధికారాలకూ మైసూరు ప్రభుత్వానికీ సంప్రదింపులు త్వరలోనే బెంగుళూరులో ప్రారంభము కాగలవని తెలుస్తున్నది. మైసూరు ప్రతినిధివర్గ నాయకుడుగావున్న ఆంతరంగిక మంత్రి శ్రీ హెచ్. సిద్ద వీరప్ప నేడు బెంగుళూరుకు బయలుదేరారు.

కోలారు గనులను జాతీయం చేయాలని రాష్ట్ర శాసనసభ నిర్ణయించింది. అయితే పరిహారం విషయమై గని అధికారులకూ ప్రభుత్వానికీ ఒప్పందం కుదరలేదు. జాతీయంచేసే నిర్ణయం జరగటానికి ముందు నాటి మార్కెట్లో ఉన్న విలువను బట్టి పరిహారం ఇస్తామని మైసూరు ప్రభుత్వము చెప్పింది. ఇంపీరియల్ బ్యాంకును జాతీయం చేసేటప్పుడు ఇట్లాగే జరిగింది. గని అధికారులు మాత్రం తమ పద్దులలో ఉన్న ధరల ప్రకారమే ఇవ్వాలని కోరుతున్నారు.

ఇక్కడ నాలుగురోజుల పాటు జరిగిన సంప్రదింపులలో అభిప్రాయభేదాలు చాలావరకు సర్దుబాటుఐనవనీ తెలుస్తున్నది. బెంగుళూరు సంప్రదింపులలో పరిహారం విషయమై ఒప్పందం కుదిరే అవకాశం ఉన్నట్లు తెలుస్తున్నది.

జాతీయం చేసే పద్ధతి న్యాయంగా ఉండేటట్లయితే, దానికి భారత ప్రభుత్వం మద్దతుయిస్తుందని తెలుస్తున్నది.

హైదరాబాదు, ఏప్రిల్ 19: హైదరాబాదు హైకోర్టు మాజీ ప్రధాన న్యాయమూర్తి శ్రీ జార్. యస్. నాయక్ నాగపూర్‌లోని (ఇంగ్లండు) ఒక వైద్యశాలలో యీనెల 17 వ మరణించారు.

సమితి ధర్మకర్తృత్వ సంఘంలోని వివిధ దేశాల ప్రతినిధులకు ఈ మధ్య కృష్ణమీనన్ విందుచేశారు. ఎడమనుంచి శ్రీ అర్థర్ లాల్ (సమితిలో భారతదేశపు శాశ్వతప్రతినిధి), శ్రీ రఘురామయ్య, శ్రీ కృష్ణమీనన్,

రైల్వే వారోత్సవాలలో, బాగా ఉద్యోగ విధులను నిర్వర్తించిన సిబ్బందికి రాష్ట్రపతి బహుమతులు యోగ్యతా పత్రాలూ ఇచ్చారు. తూర్పు ప్రాంతపు రైల్వేలో పనిచేస్తున్న శ్రీ కె. వి. సూర్యనారాయణ బహుమతి అందుకుంటున్నారు.

జర్మన్ ఫెడరల్ రిపబ్లిక్ ప్రభుత్వం భారత ప్రభుత్వానికి ఒక సంచార దంత చికిత్సాలయాన్ని బహూకరించింది. కేంద్ర ఆరోగ్యమంత్రి రాజకుమారి అమృతకౌర్ ఏప్రిల్ 17 న జర్మన్ రాయబారి శ్రీ ఇ. డబ్ల్యు. మేయర్ వద్దనుంచి స్వీకరించారు.

ఆంధ్ర ముఖ్యమంత్రి శ్రీ బెజవాడ గోపాలరెడ్డి ఏలూరు వచ్చినప్పుడు అలుగోలు గంగరాజు (శిల్పి) వారికి వెండిపనిమీద చేసిన చేతికర్రను బహూకరించారు.

# అంబర్ చర్ఖా ఆర్థిక ప్రయోజనాలు

## గమనించిన తర్వాతనే ప్రణాళికలో ముఖ్యస్థానం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 18: "అంబర్ చర్ఖాతో భారీ ఎత్తున పరీక్షలు జరిపేందుకు ప్రభుత్వం ధనసహాయం చేయ నిశ్చయించినప్పటికీ, ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో దానికి స్థానం ఇవ్వటం వంటి పెద్ద కార్యక్రమాలకు మాత్రం దానిని గురించిన ఆర్థిక వివరాలు పూర్తిగా తెలియటం అవసరం." అని ప్రధాని నెహ్రూ నేడు లోక్‌సభలో శ్రీ ఎన్. వి. గాడ్గిల్ ప్రశ్నకు జవాబిస్తూ వెల్లడించారు.

అంబర్ చర్ఖాల ఉత్పత్తికి ఒక ప్రారంభ ప్రణాళికను తయారు చేస్తున్నట్లు కూడా ప్రధాని వెల్లడించారు. మొదట పదివేల చర్ఖాలను తయారుచేస్తారు.

కుటీర పరిశ్రమలకు నూలు ఉత్పత్తి చేసే సాధనాల్లోకల్లా ఉత్తమమయింది ప్రభుత్వానికి కావాలనీ, అంబర్ చర్ఖాను చాలా అభివృద్ధి చేశారనీ, ఇంకా అభివృద్ధి అవుతున్నదనీ అన్నారు. దీనికన్నా మేలయినదివస్తే దానిని కూడా ప్రభుత్వం స్వీకరిస్తుందనీ, కుటీర పరిశ్రమల్లో అత్యుత్తమ సాంకేతిక నైపుణ్యాన్ని ఉపయోగించటం తమ అభిమతమనీ ఆయన తెలియజేశారు.

## బ్రిటన్‌లో "భారతదర్శన్" చిత్ర ప్రదర్శనం

లండన్, ఏప్రిల్ 19: రష్యన్ నాయకులకు, బ్రిటిష్ మంత్రులు, బ్రిటన్‌లోని రాయబారులు మొదలైన వారికి "భారతదర్శన్" చలనచిత్రాన్ని చూపాలని ఆసియా చలనచిత్ర సంఘం నిర్ణయించింది.

రష్యన్ నాయకుల భారతదేశ సందర్శనానికి సంబంధించిన దీ చిత్రం.

## కుట్రదార్లకు డచ్చి మద్దతు

### ఇండొనీషియా చర్యపై ఆందోళన

జకార్తా, (ఇండొనీషియా), ఏప్రిల్ 19: ప్రభుత్వంపై కుట్రచేసిన నేరానికి ఇండొనీషియా న్యాయస్థానం విచారిస్తున్న డచ్చి పౌరుడు లియాన్‌జంగ్ ష్లీగర్ హఠాత్తుగా జబ్బుచేసి మరణించాడు.

ఈ కుట్ర నేరం విచారణపట్ల హాలండ్‌లో ప్రజలకు ఇండొనీషియా పట్ల ఇటీవల విపరీతంగా రోషం పెరిగింది. ష్లీగర్‌కి మరణశిక్ష విధించాలని ఇండొనీషియా అధికారులు న్యాయస్థానంలో కోరారు.

## పక్షవాతం టీకావల్ల శిశువు మృతి

### అమెరికన్ ప్రభుత్వంపై దావా

ఇడాహో, ఏప్రిల్ 19: చిన్నతనంలో సంభవించే పక్షవాతం చికిత్స కోసం సాల్క్ టీకా వెయ్యగా చనిపోయిన మొట్టమొదటి శిశువు మృతికిగాను పరిహారం ఇవ్వాలని ఆ శిశువు తలిదండ్రులు అమెరికన్ ప్రభుత్వంపైన దావా తెచ్చారు. నష్టానికి కోరిన పరిహారం లక్షన్నర డాలర్లు.

మరో శిశువుకి సాల్క్ టీకా వేసిన తరవాత పూర్తిగా పక్షవాతం కమ్మింది. ఆ శిశువు తలిదండ్రులు అమెరికన్ ప్రభుత్వంపై రెండున్నర లక్షల డాలర్లకు దావా తెచ్చారు.

## వైద్యం చేయించనందుకు శిక్ష

ఆంస్టర్‌డాం, ఏప్రిల్ 19: తొమ్మిది సంవత్సరాల వయస్సు పిల్లవాడికి జ్వరం వస్తే వైద్యం చేయించకుండా, అతని మరణానికి కారకులైనందుకు ఒక కార్మికునకీ అతని భార్యకూ నెలరోజులు జైలు సంప్రాప్తించింది. ఈ కార్మిక దంపతులకు తాను చేపుని అవతారం అని చెప్పే ఒక చేపలవ్యాపారి పరమ గురువు. ఆ గురువు, వైద్యుడంటే దయ్యమేనని తన శిష్యులకు బోధిస్తాడట. అతనికి 600 మంది శిష్యులు ఉన్నారు—అతనివద్ద నే చేపలుకొని భక్తిమాత్రమే ఉంటాడు—అతని చేపలు బాగానే అమ్ముడుపోతున్నాయి.

## అపీల్లు ట్రిబ్యూనల్ ధిక్కార నేరం

### బొంబాయి కార్మిక నాయకులకు శిక్ష

బొంబాయి, ఏప్రిల్ 18: పారిశ్రామిక వివాదాల అపీల్ ట్రిబ్యూనల్‌ని ధిక్కరించిన నేరంమీద బొంబాయి ఇంజనీరింగ్ కార్మిక సంఘ అధ్యక్షుడు శ్రీ టి. ఎస్. జోగ్లేకర్‌కి 1 నెల విడి శిక్షను కార్యదర్శి శ్రీమతి అంబికా బెహారేకి 21 నెలల విడిశిక్షను నేడు అపీల్లు ట్రిబ్యూనల్ (బొంబాయి) శిక్ష విధించింది. మరొక కార్యదర్శి శ్రీ ఎస్. నాదేకర్‌ని గట్టిగా మందలించి విడిచిపెట్టింది.

బొంబాయి గ్యాస్ కంపెనీ కార్మిక వివాదంలో పరిష్కర్తగా పనిచేస్తున్న శ్రీ ఎస్. హెచ్. నాయక్ పక్షపాతంతో ప్రవర్తించారనీ, ఆయన తో న్యాయాన్ని, పరిష్కర్తను కూడా కంపెనీ కొనివేసిందనీ ఈ కార్మిక నాయకులు కరపత్రాలను పంచిపెట్టారు.

అపీల్లు ట్రిబ్యూనల్‌లో శ్రీ ఎఫ్. జజీభాయ్, శ్రీ డి. ఇ. రూబెన్ ఉన్నారు.

## కొమిన్‌ఫారం పత్రిక నిలుపుదల

పారిస్, ఏప్రిల్ 12: కొమిన్‌ఫారం వారపత్రిక "ఫర్ లాసింగ్ పీస్, ఫర్ పీపుల్స్ డెమాక్రసీ" (శాశ్వత శాంతి, ప్రజా ప్రభుత్వాలకోసం") ఇవాళతో నిలిచిపోయింది. ఈ విషయాన్ని ఇవాళే వెలువడిన తుది సంచిక ప్రకటించింది.

## ఆంధ్ర పురపాలక సంఘాల మండలి

మచిలీపట్నం, ఏప్రిల్ 19: ఆంధ్ర పురపాలక సంఘాల మండలి కార్యవర్గ సమావేశమూ సర్వసభ్య సమావేశమూ ఈ నెల 25, 26 తేదీలలో ఆదోనిలో జరుగుతవి.

టోలుగేటు రద్దుచేస్తున్నందువల్ల పురపాలక సంఘాలకు ఇస్తున్న పరిహారాన్ని రద్దుచేస్తూను, వినోదాల పన్ను చట్టానికి సవరణలు చేస్తూను, పురపాలక సంఘాలకు ఎన్నికలు జరిపించేందుకూ, వార్డులను పునర్విభజన చేస్తూను, జిల్లా పురపాలక సంస్థల చట్టాన్ని సవరిస్తూను ప్రభుత్వం ఇటీవల గెజెట్‌లో చేసిన ప్రకటనలను ఈ సమావేశాల్లో చర్చించటం జరుగుతుంది.

## హోటలు పనివానిని హింసించిన నేరం

విస్సన్నపేట, ఏప్రిల్ 18: రామకృష్ణ అనే హోటలు పనివానిని వలుగు హింసించారనే అభియోగం సందర్భంలో గూడూరు రామారావు, శేషావతార్కృష్ణ, శీలం సుందరం అనే ముగ్గురు గత మంగళవారం స్థానిక సబ్ మేజిస్ట్రేట్ కోర్టుకు వచ్చి పోలీసులకు స్వాధీనమైనారు. ఆ తర్వాత జామీనుపై విడుదలైనారు. ఈ నేరం సందర్భంలో ఇదివరకే హనుమంతరావును అరెస్టు చేసి యీ ముగ్గురికోసం పోలీసులు వెదుకుతున్నారట.

# ఉగాదినాడు సాహిత్య గోష్ఠులు - కాలక్షేపాలు

ఏలూరు, ఏప్రిల్ 16: ఉగాది పండుగనాడు ఏలూరు సాహిత్యమండలి సర్వసభ్య సమావేశం, సాహిత్యగోష్ఠి జరిగినవి. సమావేశానికి శ్రీ శంకరరామారావు అధ్యక్షత వహించారు. కార్యదర్శి శ్రీ పుల్లాభొట్ల రామమూర్తి వార్షిక నివేదిక సమర్పించారు.

సాహిత్యమండలికి ఈ దిగువ కార్యవర్గం ఎన్నికైనారు. అధ్యక్షుడు-శ్రీ శంకరరామారావు, ఉపాధ్యక్షుడు-శ్రీ మానం వెంకటరామయ్య, కార్యదర్శి-శ్రీ పుల్లాభొట్ల శ్రీరామమూర్తి, సహాయ కార్యదర్శి - శ్రీ కొడాలి నాగేశ్వరరావు, కార్యవర్గ సభ్యులు-శ్రీయుతులు భోగరాజు బుచ్చి రామయ్య, రుద్రావజ్ఝల విశ్వేశ్వరశర్మ, చంద్రకంటి సూర్యనారాయణమూర్తి, తూము వెంకటేశ్వరరావు, పొతుకుచ్చి రామబ్రహ్మేశ్వరరావు, మొక్కపాటి కృష్ణమూర్తి, సామవేదం జానకిరామశర్మగారలు. శ్రీ మంచాళ్ళ ప్రీతారామశాస్త్రి పంచాంగపఠనం చేశారు.

అనంతరం కవిత్వగోష్ఠి జరిగింది. ఆ గోష్ఠిలో శ్రీయుతులు సామవేదం జానకీ రామశర్మ, ఐంబాని నారాయణమూర్తి, మొక్కపాటి కృష్ణమూర్తి, భోగరాజు, చంద్రకంటి సూర్యనారాయణమూర్తి, కాదరాజు భోగరాజు, కుంచెమొన శ్రీరాములు మొదలైనవారు పాల్గొన్నారు.

## తాళ్ళపల్లి

నూజివీడు, ఏప్రిల్ 16: పట్నాకు తాలూకా తాళ్ళపల్లి గ్రామంలో బాలీయ వికాస కార్యక్రమాలు అధ్య

ర్యాన ఉగాది ఉత్సవాలు జరిగినవి. ఆటలపాటీలు, బుర్రకథా కాలక్షేపాలు, శిశు ప్రదర్శనం జరిగినవి. సహకార సంఘాల ఇన్‌స్పెక్టరు శ్రీ నరసింహారావు అధ్యక్షతన సభ జరిగింది. పోటీలలో గెలుపొందినవారికి డా॥ సన్యాసిరావు బహుమతులు పంచిపెట్టారు.

## రామిరెడ్డిపల్లి

ఉగాదినాడు బందరు వాస్తవ్యులు శ్రీ కె. సంజీవరాజ భాగవతార్ హరికథా కాలక్షేపం గావించారు. శ్రీ పూర్ణయ్యశాస్త్రి, శ్రీ చంద్రం పక్క వాద్యాలు నిర్వహించారు.

ఇసుగంచి పోలీసు హెడ్ కానిస్టేబుల్ శ్రీ అబ్దుల్ అజీజ్ గెంటాల జోగప్పయింటిని సోదా చేసి వాల్లు పిసాల పుస్తకాలును, ఇతర పరికరాలను స్వాధీన పరుచుకొన్నారు. బందిగాము మేజిస్ట్రేటు ముద్దాయికి రెండుమాసాల శిక్ష విధించారు.

## పూనా ఆంధ్రుల ఉగాది వేడుక

పూనా, ఏప్రిల్ 12: నగర ఆంధ్ర సమితి తెలుగు గ్రంథాలయం ఆధ్వర్యాన ఉగాది ఉత్సవం నేడు శ్రీ డి. సత్యనారాయణ అధ్యక్షతన జరిగింది. సంఘ అధ్యక్షులు శ్రీ ఇ. నెలం అతిథులకు స్వాగతమిచ్చారు.

శ్రీ సుబ్బారావు పంచాంగ శ్రవణముతో కార్యక్రమం ప్రారంభమైంది. శ్రీ కె. వాసుదేవరావు "వరాహకోష" లేక "మందులమ్మేవాడు"గా హిందీలో నటించారు. "పల్నాటి వీరులు" అనే తెలుగునాటకం ప్రదర్శించారు. ఇందులో సంఘకార్యదర్శి శ్రీ వై. బి. యస్. నిలజ్ "కన్నమదాసు"గా నటించారు. వీరి నటనా నైపుణ్యమును ప్రశంసించారు. శ్రీ జి. వి. రమణారావు "విప్రనారాయణ"లో నట మునిగిరి. ఈ కార్యక్రమాల్లో పాల్గొన్న వివిధ సంఘాలవారు పంచిపెట్టిన ... ఫలహారాలు అందజేశారు.

అనంతపురంజిల్లా ప్రత్యేక అభివృద్ధి పథకం ... కేంద్రంకోసం కట్టిన భవనానికి వ్యవసాయశాఖామంత్రి శ్రీ కందుల ఓబులరెడ్డి ఏప్రిల్ 16వ ప్రారంభోత్సవం చేశారు. వారి ప్రక్కన ప్రాంతీయ నాగెపెంటల నిర్వాహకుడు శ్రీ ప్రభాకరరెడ్డి, జిల్లా వ్యవసాయ శాఖాధికారి శ్రీ ఎ. వి. ఆదిశేషారెడ్డి.



Printed and Published for Nageswara Rao Estates (private) Ltd., by S. Radha Krishna, at The Andhra Patrika Press, 6 & 7 Thambu Chetty St, Madras. 1. Editor S. Sambhu Prasad.